—: శ్రీ :—

# శాస్త్రి ధర్మ సంగ్రహము.

మొదటి భాగము

గ్రంథకర్త.

మన్నేరు శ్రీరాములు.
రిటైర్ టీచర్, పులివెందుల.

...ర చరితానాంతు వసుధైవ కుటుంబకమ్.

...రితులకీ విశ్వమంతయు స్వకుటుంబమేయగును.

...బువాణాని పరంపరస్మాత్ । మధుక్షరన్తీవసతాంఫలాని ।
...సుపాఙ్ఞ శిరస్మి జిహ్వే । నామానిసర్వేశ్వర గోచరాణి ॥

...కా! నీకుఁ జేయియొగ్గి సర్వోత్తమమైన సత్యార్థమునుఁ
...ప్పెదను వినుము. సత్పురుషులకు జన్మ సాఫల్యముఁ గలిగించు
నట్టి మధురమైన భగవన్నామమునుసర్వదా పఠింపుచుండుము.

"నాప్రాణమా సర్వేశ్వరుని సన్నుతింపుము; ఆయన చేసిన
యుపకారములలో దేనిని మరువకుము." కీర్తన 103:2

ద్వితీయ ముద్రితము

—::—

శ్రీరామ్ ప్రింటింగ్ వర్క్సునందు ముద్రింపబడినది.
పులివెందుల.

1950

(వెల ౦-౧౨-౦)

II

# విషయసూచిక.



——::——

# జీవాత్మ మేలుకొలుపులు.

---

మేలుకో నరజీవ మేలుకో జీవాత్మ మేలుకో ఓజీవ మేలుకో॥
ఎన్నాళ్లు బ్రతుకుదునో యిపుడె చావనటంచు వెఱ్ఱివైభ్రమసేవు మేలుకో॥
అన్ని దేహములొక్క నరశ్వాస మాత్రమున హతమగుట సహజము మేలుకో॥
మనకండ్లముందర మనవారలెందరో మట్టిపాలైపోయిరి మేలుకో॥
మనము వారేగినమార్గమున జనెదము మనకేల యిహసుఖము మేలుకో॥
నీకునీవేగాని నీకెవ్వరునులేరు నీకేల యీభ్రాంతి మేలుకో॥
ఎండమావుల బ్రతుకు నీటిమీద బుగ్గఓటికుండీతనువు మేలుకో॥
మేటీశ్వరుండైన కోటీశ్వరుండైన కాటికేపోవలెను మేలుకో॥
ధనముగల్గితె లెస్సఘనమనిమది నెంచి గమనింపకున్నావు మేలుకో॥
ధనవంతులెందరో ధరణీశులెందరో ధరలోన హతమైరి మేలుకో.
భామలవలలోనఁబడి లేవకున్నావు పామరమతిజీవ మేలుకో॥
సోమరివై యిట్లు కామమందున్నావు కాచియున్నది చావు మేలుకో॥
అప్పుడిప్పుడులేక ఎప్పుడేవేళనో తప్పదు మరణము మేలుకో॥
గొప్పసర్పమునోట కప్ప జిక్కినరీతి యిప్పజీవులబ్రతుకు మేలుకో॥
గబ్బుదేహమునమ్మి మబ్బులోనున్నావు అబ్బబ్బ నాతండ్రి మేలుకో॥
జబ్బుజేసితె చావువచ్చినిలచినయపుడు తబ్బిబ్బులయ్యేవు మేలుకో॥
అయ్యయ్యొ నరజన్మమన్యాయమైపోతె యింకేమి జన్మములేదు మేలుకో॥
కనురెప్పపాటున కాలకింకరులొచ్చి కట్టికొంపోయెదరు మేలుకో॥
రాత్రిపగలు నరక్షణమైనఁ బాయక రాజరాజునుగూడి మేలుకో॥
కల్లభ్రాంతి జగము కాలతోఁ బోజిమ్మి కరుణగురునిఁజేర మేలుకో॥
మేలుకొని రక్షకుని వేలిమిగ భజియింప మేలొందెదవు జీవ మేలుకో॥

ఉ॥ దేవమదీయ మానసముదేవర మీఁదను ధర్మమందునన్ ।
భావిననిల్చునట్లుగను భ్రాంతులఁబోలె జనంబులన్ సదా ।
భావనచేసి తొడ్పడుచునత్తిలునట్లును పాపబాటకున్ ।
బోవక యుండునట్లును ప్రభుప్రచారమియ్యుమ సత్కృపన్, ॥

—::—

## — సుకవులు —

సత్యము, ధర్మము, శాంతము, భూతదయ' భగవద్భక్తి, సన్మార్గము మొదలగు సద్విషయములను బోధించు కవిత్వము చేయువారు సుకవులు వీరు వందనీయులు.

## — కుకవులు —

మర్మస్థానములను, నీతిబాహ్యములైన కామమోహాదులను, శృంగారమును, పచ్చిబూతులును, గొప్పగా వర్ణించు కథలను, నాస్తికవిచారమును గుఱించియు కవిత్వము చేయువారు కుకవులు వీరు నిందనీయులు.

శ్లో॥ యుక్తియుక్తముపాదేయం వచనం బాలకాదపి ॥

తా॥ యుక్తి యుక్తముగానుండు పక్షమున బాలకుని వచనమైనను గ్రహింపవలసియే యుండును.

## — అంకితము —

స్వర్గీయులైన నా జననీ జనకులగు సూర్రెమ్మ నారాయణయను వారికి ఈశాస్త్ర ధర్మ సంగ్రహము సమర్పితము.

తే॥ అంకితము సత్కారణతోడ నరసి దీవన। లొసఁగుసు దేవదేవయెన్నటికిఁజేటు।
లేని నిరతి శయానంద మిచ్చికావు। మనుచు వేడెద సర్వేశ యమలచరిత ॥

## — విజ్ఞాపన —

ఈ పుస్తకమునందు నా అల్పజ్ఞాన మూలముగాఁ గలిగిన గుణలక్షణ దోషములు చదువరులకు గోచరించినను, సత్కారణ, ఉదారబుద్ధిఁగల మహాశయులు ప్రాముఖ్యముగా విషయామృతమును మాత్రముఁ గ్రోలి దోషములను దిగవిడి చెదరని నమ్ముచున్నాను. అపశబ్దంబులగూడియున్నను సనాతన ధర్మమైన సంగతులు సర్వదోషములఁ బోనడచును. విచిత్రార్థాలంకారములతో నిండియున్నను భగవంతుని మహిమను వర్ణించని వాక్యములు నిరర్థకంబులు "చెఱకునకు వంకబోతేమి చెడునతీపు" అను రీతి లక్షణదోషములున్నను విషయసంగ్రహ సారమును గ్రోలవలయునని విన్నవించుచున్నాను.

పులివెందుల
కడప జిల్లా

ఇట్లు బుధజన విధేయుఁడు,
మన్నెరు శ్రీరాములు.

1



శ్రీ

## శ్రీ త్ర్యేక దేవాయనమః శ్రీ గురవేనమః.

### దైవ ప్రార్థన.

అసతోమా సద్గమయా తమసోమా జ్యోతిర్గమయ
మృత్యోర్మా మృతజ్గమయ. శతపథ బ్రాహ్మణము.

తా॥ నన్ను అసత్తునుండి సత్తునకును చీకటినుండి వెలుఁగు
నకును మృత్యువునుండి అమృతత్వమునకును నడుపుఁడు.

ఓంత్వాభగ ప్రవిశానిస్వాహాసమాభగ ప్రవిశస్వాహా।
తస్మిన్ సహస్రశాఖేనిభగాహంత్వయిమృజేస్వాహా॥
తైత్తిరీయోపనిషత్.

తా॥ ఓ భగవంతుఁడా! నేను నీలో వెలుఁగుచుందునుగాక (అనగా నీసేవఁ జేసి పాపనిర్ముక్తుఁడ నగుదునుగాక నన్ను (క్షేమచే కరుణింతువుగాక) ఓ భగవంతుఁడా! సహస్ర శాఖలుగల (నదివంటి) నీయందు నేను (సర్వపాపములను) కడుగుకొందుముగాక.

శ్లో॥ బద్ధేనాంజలి నానతేన శిరసాగాత్రైస్సరోమోద్గమై।
కంఠేన స్వరగద్గదేననయనేనోద్గీర్ణ బాష్పాంబునా।
నిత్యంత్వచ్చరణారవిందయుగళ ధ్యానామృతాస్వాదినా।
మస్మాకం సర్వేశదేవసతతం సంపద్యతాంజీవితమ్॥
ముకుందమాల.

తా॥ ఓసర్వేశ్వరా! మేము ఎల్లప్పుడును మనసునందు నీపాదారవిందములను ధ్యానముచేయుచు ఆనందము ననుభవించుచు చేతులొగ్గి శిరమువంచి నమస్కారము చేయుచుండునట్లును శరీరము పులకాంకితమై యుండునట్లును కంఠము గద్గదమగు నట్లును కన్నులానంద బాష్పములచే నిండునట్లును మేము బ్రతికినంత కాలము ఎడతెంపులేక యివ్విధముగా జరుగుచుండునట్లుగా అనుగ్రహింప నిన్ను వేడుచున్నాము.

ఉ॥ ఎన్నియొ పాపకార్యములయే నొకరించితి మందబుద్ధినై ।
కన్నులఁగానలేక భవకర్మజలార్ణవమందు గ్రుంకియే ।
తెన్నునెఱుంగ కుంటినతిదీనుఁడ నన్కరుణింపుమంటినా ।
పన్నశరణ్య నాదురితపంక్తికృపన్ హరియించి బ్రోపవే ॥

శా॥ వీసంబైన భవత్పదాంబుజ రజంబే చాలునెంతెంతలా ।
దోసంబుల్ హరియింపన్; నొక్కపరిశాంతుండై భవన్నామజి ।
జ్ఞాసంజల్పినంగల్గు భక్తునకభీష్టప్రాప్తినీయందెనా ।
యాసల్ నిల్పితి నన్నుఁగావగదె దేవాదీనమందారమా ॥

—: పరమగురు ప్రార్థన. :—

శ్లో॥ గురువేపరబ్రహ్మ గురురేవపరాగతిః ।
గుశబ్దస్వంధకారస్యాత్ రుశబ్దస్తన్నిరోధకః ।
అంధకార నిరోధత్వాద్గురు రిత్యభిధీయతే ॥

తా॥ గురువే పరబ్రహ్మము గురువే సద్గతి గువర్ణము అంధకారము రువర్ణము అంధకారమును నిరోధించునది అనగా అజ్ఞానాంధకారమును బోగొట్టుటవలన గురువని చెప్పఁబడును.

"గురుచరణం భవహరణం పరము సుఖసాధన కరణం ।
దురిత భయార్ణవతరణం మరణభయ దుత్తరణం ॥"

శా॥ శ్రీఈశూనరభూషణా వరగుణా శ్రీమంగళాకారశాం ।
తాత్మాదీన జనాదరా సకల భక్తాధీశ్వరా శిష్యకో ।
ట్యానీకంబుల పాపరాశిహరణా నిర్వాణ సంధాయకా ।
నీకుం మ్రొక్కెదఁ గ్రుంపవే భవలతల్ నిత్యాను కంపానిధీ ॥

శా॥ శ్రీమోక్షాసన సౌఖ్యమున్ సుఖులలో శ్రీసంపదల్సేవలున్ ।
నైవాఙ్ఛద్దివి వాసినౌదుననకద్దైన్యంబుల్ మహాపాతకుల్ ।
నైవోగ్రానల రాజ్యలో ధరణిమర్త్యశ్రేణి గావన్ ధరన్ ।
నైవారార్మిలి మర్త్యుఁడైన గురువృద్ధాశ్యం బొనర్తున్మరిన్ ॥
జీవాహారము నేనే, యోహా 6, 35



శ్రీయాజ్ఞ గురుభ్యోనమః

# వర్ణము లేక కులము.

---

మహనీయులారా మనపూర్వులైన యార్యులు తొలుత పాంచాలమందు ప్రవేశించునప్పటికి కులభేదము లెఱుంగకుండిరి. వీరికంటె ముందీదేశమందు నివాసికులుగా నుండిన అనాగరిక జనులను అనార్యులనియు ఔత్తరాహులైన వీరిని ఆర్యులనియు పిలుచుకొనుచుండిరి ఇవి తప్ప ఆకాలమందు మఱేవర్ణములును లేవు, అప్పటికి జాతులు కల్పింపఁబడి యుండలేదు. నడుమ కల్పింపబడిన ఈ కులములను గుఱించి శాస్త్ర దృష్టాంతములతో సంగ్రహముగా విమర్శింపబడును. పక్షపాత ఈర్ష్యారాహిత్యులై యిందలి దోషములను గమనింపక గుణములను గ్రహింప ప్రార్థితులు.

ఋగ్వేదములోని పురుషసూక్తము 12 ఋక్కు.

"బ్రాహ్మణోస్యముఖమాసీత్ । బాహూరాజన్యకృతః ।
ఊరూతదస్యయద్వైశ్యః । పద్భ్యాగ్ంశూద్రో అజాయత ॥"

తా॥ ఆయనకు (విరాట్పురుషునకు) బ్రాహ్మణుఁడు ముఖముగా నాయెను క్షత్రియుఁడు భుజములుగా చేయబడెను. తొడలు వైశ్యుఁడు శూద్రుఁడు పాదములు కాఁగలిగెను. ఋగ్వేదము పుట్టిన చాలాకాలమునకు వర్ణభేదమేర్పరుపఁబడినది. వర్ణభేదమేర్పరుపఁబడిన తర్వాత కల్పించి ఋగ్వేదములో చేర్చిన పురుషసూక్తములోని ఈ ఋక్కు భగవంతుని రూపవర్ణనాలంకారమందు వర్ణింపఁబడినదని స్పష్టముగా గానవచ్చుచున్నది. ఆ కాలమందు స్థితిభేదములనుఁబట్టి బ్రహ్మజ్ఞానము బోధించువారు బ్రహ్మకునోరు (ముఖము)గను భుజబలముతో యుద్ధము చేయు వీరులు దేవుని భుజములుగను పిక్కబలముతో తిరిగి వర్తకముఁ జేయువారు తొడలుగను సేవకావృత్తి చేయువారు పాదములుగను వర్ణింపబడిరి, బ్రాహ్మణశబ్దమందు "ఆసీత్" అనగా ఆయెను క్షత్రియ శబ్దమందు "కృతః" చేయబడెను అనియున్నది శూద్రశబ్దార్థమందలి పుట్టెనను అర్థముగల "అజాయత" అను వాక్యార్థమునకే మిగిలిన శబ్దార్థములను గొంపోవుటకంటె ఎక్కువ పదములుగల

"ఆసీత్" "కృత" ఈ శబ్దార్థములకు "అజాయత" అను పదమును గూడా నేలఁగైకొనకూడదు. ఆ కాలమందలి బ్రాహ్మణాది పదము లిప్పటికాలమందు వ్రాతగానిని లేఖకుఁడన్నట్లును, సేవకుని భటుఁడన్నట్లును, విద్యగఱపువాని అయ్యవారన్నట్లును, వ్యావహారికముగా నేర్పడిన నామములేగాని వేఱొండియుగాదు.

మనుస్మృతి ప్రథమాధ్యాయము.

శ్లో॥ లోకానాంతు వివృద్ధ్యర్థం ముఖబాహూరుపాదతః।
బ్రాహ్మణం క్షత్రియం వైశ్యం శూద్రన్ చనిరవర్తయత్ ॥

జగముల వృద్ధికొఱకు ముఖమునుండియు భుజములనుండియు, తొడల నుండియు, పాదములనుండియు, బ్రాహ్మణ, క్షత్రియను, వైశ్య, శూద్రులను సృజించెనని చెప్పి మరల 34 శ్లోకమున.

శ్లో॥ అహంప్రజాస్సిసృక్షుస్తు తపస్తప్త్వాసుదుశ్చరమ్।
పతీన్ ప్రజానామసృజన్ మహర్షీనాదితోదశ॥

తా॥ బ్రహ్మజనులను పుట్టించుటకై దుశ్చరమైన తపస్సుచేసి తొలుత ప్రజాపతులైన పదుగురు మహర్షులను కలుగజేసినట్లు చెప్పియున్నాఁడు. ఈ ప్రజాపతులు సర్వమును సృజించిరి. 31-వ శ్లోకము ప్రకారము బ్రాహ్మణాది జాతుల వారు బ్రహ్మ ముఖాదికమునుండి పుట్టిరా లేక 34 శ్లోకము ప్రకారము పదిమంది ప్రజాపతులవలన పుట్టిరా? పైశ్లోకములకు విరోధముగా శ్రీమద్రామాయణమునందు.

శ్లో॥ మనురనుష్యాన్ జనయత్ కాశ్యపస్య మహాత్మనః।
బ్రాహ్మణాన్ క్షత్రియాన్ వైశ్యాన్ శూద్రాన్ చమనుజర్షభ ॥

తా॥ కశ్యపుని భార్య మనువను నామె బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులైన మానవులందఱిని సృజించెనని చెప్పబడియున్నది. మనువను నామెనుఁబట్టియే మనుజశబ్ద ముత్పత్తియగుట కాధారమై యుండనోపునని వ్యాఖ్యాము. భగవద్గీతలందు పై వానికి ప్రతికూలముగా.

శ్లో॥ చాతుర్వర్ణ్యంమయాసృష్టం గుణకర్మవిభాగశః॥

తా॥ గుణకర్మల ఏర్పాటునుఁబట్టి నాలుగు జాతుల కలుగఁజేసినట్టు కృష్ణుఁడు చెప్పుచున్నాఁడు.

వర్ణశబ్దార్థమునుఁబట్టి చూచిన దేహచ్ఛాయలనుఁబట్టి యేవర్ణభేదము లేర్పరుపఁబడినవని తేలుచున్నది.

భారతశాంతి పర్వమునందు.

శ్లో॥ బ్రాహ్మణానాం సితోవర్ణః। క్షత్రియాణాంచలోహితః।
వైశ్యానాంపీతకోవర్ణః। శూద్రాణాం అసితస్తథా॥

తా॥ బ్రాహ్మణులకు తెల్లవర్ణము, క్షత్రియులకెఱ్ఱ వర్ణము, వైశ్యులకు పచ్చవర్ణము, శూద్రులకు నల్లవర్ణము అనిచెప్పఁబడియున్నదేఁగాని ఈ నియమ ప్రకారము లేక బ్రాహ్మణులలో నల్లనివారుండుటయు శూద్రులలో నెఱ్ఱనివారుండుటయు ప్రత్యక్షముగాఁ జూచుచున్నాము. ఇట్లు నొకదాని కొకటి విరుద్ధ భావములతోటి చెప్పఁబడిన కులభేదములు కేవలకల్పితముగాని నిజముగాదు. కొన్నిటియందు వారుచేయు కర్మసంస్కారాదుల బట్టియే కులము లేర్పరుపఁబడినట్లున్నది.

భవిష్యపురాణము.

శ్లో॥ హరిణీగర్భసంభూతో ఋశ్యశృంగమహామునిః।
శ్వపాకీగర్భసంభూతో పితావ్యాసస్యసత్తమః।
గణికాగర్భసంభూతో వసిష్ఠశ్చమహామునిః।
తపసాబ్రాహ్మణోజాతః సంస్కారస్తత్రకారణమ్।

తా॥ ఋశ్యశృంగుఁడు జింకకును వ్యాసుని తండ్రి పరాశరుఁడు మాలదానికిని వసిష్ఠుఁడు వేశ్యకునుఁబుట్టియు తపస్సుచేత బ్రాహ్మణులైరి. దీనికి కారణము సంస్కారము నిశ్చయముగా నుంచినడతయొక్కటి మాత్రమే బ్రాహ్మణత్వమునకు కారణము. ఇందుకు వజ్రసూచికోపనిషత్తునందు.

శ్రుతి॥ సత్యంబ్రహ్మతపోబ్రహ్మ బ్రహ్మచేంద్రియనిగ్రహః।
సర్వభూతేదయాబ్రహ్మ ఏతద్బ్రాహ్మణలక్షణమ్।
సత్యంనాస్తి తపోనాస్తినాస్తి చేంద్రియనిగ్రహః।
సర్వభూతేదయానాస్తి ఏతచ్చండాలలక్షణమ్॥

పైరెండు శ్రుతుల తాత్పర్యము సత్యము తపము ఇంద్రియ నిగ్రహము సర్వజీవులయెడ దయ ఇవి బ్రాహ్మణ లక్షణములు ఈ గుణములు లేనివాఁడు చండాలుఁడు ఇందుకను గుణముగా భారతానుశాసనిక సర్వాంతర్గతమైన యుమామహేశ్వర సంవాదమునందు.

శ్లో॥ నయోనిర్నాపి సంస్కారో నశ్రుతంనచసంతతిః।
కారణానిద్విజత్వస్య వృత్తమేవతు కారణమ్।

సర్వోయం బ్రాహ్మణోలోకే వృత్తేనచవిధీయతే।
వృత్తేస్థితస్తు శూద్రోపి బ్రాహ్మణత్వం నియచ్ఛతి॥

తా॥ పుట్టుక సంస్కారము (ఉపనయనాదులు) వేదాధ్యయనము సంతతి బ్రాహ్మణత్వమునకు కారణములు కావు; మంచి నడతయొక్కటియే కారణము లోకములో బ్రాహ్మణత్వమంతయు మంచి వృత్తివలననే గలుగును. సద్వృత్తి యందున్న శూద్రుడును బ్రాహ్మణత్వము పొందును,

భారతారణ్యపర్వమందు ౯=వ ఆశ్వాసమున

క॥ పాపవర్తనుండు బ్రాహ్మణుండయ్యును।
నిజము శూద్రుకంటె నీచతముడు।
సత్యశౌచ ధర్మశాలి శూద్రుండయ్యు।
నతడు సద్విజుండు మునికినుతులు॥

"బ్రహ్మణాస్తే జనోచైవ బ్రాహ్మణో" బ్రహ్మతేజస్సుగలవాడు బ్రాహ్మణుడు భారతారణ్య పర్వమున వైశంపాయనుడు ధర్మజునితో.

శ్లో॥ శూద్రోపిశీల సంపన్నో గుణవాన్ బ్రాహ్మణోభవేత్।
బ్రాహ్మణోపిక్రియా హీనశూద్రాత్ప్రత్యవరోభవేత్।
నజాతిర్దృశ్యతేరాజన్ గుణాపికల్యాణకారకాః।
జీవితంయస్య ధర్మార్థంపరార్థేయస్య జీవితమ్॥

తా॥ సదాచార సంపన్నుడును గుణవంతుడునునగు శూద్రుడు బ్రాహ్మణుడగును క్రియాహీనుడైన బ్రాహ్మణుడు శూద్రునికంటె తక్కువ వాడగును. ఓ రాజా జాతియందేమియులేదు గుణములే శుభకరములు ఎవని జీవితము ధర్మార్థమును పరోపకారార్థమునగునో వాడే శ్రేష్ఠుడు.

భాగవత సప్తమస్కంధమున ప్రహ్లాదుడు నృసింహమూర్తితో.

మ॥ అమలజ్ఞానసదాన ధర్మరతి సత్యక్షాంతి నిర్మత్సర।
త్వములన్ యజ్ఞతపోన సూయలగడుందర్పింమ ధాత్రీ సుతో।
త్తముకంటె శ్వపచుండు ముఖ్యుండు మనోర్థప్రాణవాక్కర్మములన్।
సమతన్నిన్ను భజించె నేని భగవత్సంతోషకుండౌగుడిన్॥

తా॥ నిర్మల జ్ఞానము దానధర్మములు సత్యసహింపులు మాత్సర్యము లేకుండుట, యజ్ఞము తపస్సు ఈ సద్గుణములులేని బ్రాహ్మణునికంటె త్రికరణ శుద్ధిగల చండాలుడు శ్రేష్ఠుడు.

భగవద్గీత 16 అ. 15, 16 శ్లోకములు.

శ్లో॥ ఆఢ్యోఽభిజనవానస్మి కోఽన్యోఽస్తి సదృశో మయా।
,......................ఇత్యజ్ఞానమోహితాః॥

శ్లో॥ అనేకచిత్తవిభ్రాంతి మోహజాల సమావృతాః।
......................పతంతి నరకేఽశుచౌ॥

తా॥ నేనే ధనవంతుఁడను నేనే మంచి కులమునఁ బుట్టిన వాఁడను నాతో సమానులెవరు అని ఈరీతిగా నజ్ఞానమోహితులై అనేక విధములగు చిత్తవిభ్రాంతి మోహావలలోఁ దగుల్కొని యశుచియగు నరకములో గూలుచుందురు. ఇంతకును దేహమనిత్యము తోడరాదు మృతంబైన దేహంబును శునకాదులు భక్షించు దేహ తంత్రంబులఁ దగుల్కొనుట నజ్ఞానజన్య మూఢత్వకారణంబు మోక్షప్రదాతయగు సర్వేశ్వరుఁడు సకలభూతములకు నాత్మేశ్వరుండు ప్రియుండు నాతని నిజభక్తి భజించిన జ్ఞానంబుఁ గలిగి మోక్షలభ్యంబగునేఁగాని వర్ణకట్టుఁబాటులవలన సుకృత మొనఁగూడదు. మేలెద్దియు లేదు నిమిషభంగుర ప్రాణులైన మర్త్యులకు మమతాహంకారంబులు నిరర్థకంబు. ఇయ్యవి ఆత్మకు దుఃఖనాశంబులగుఁగాని సుఖదాయకంబులుఁగావు.

ఆ॥ జగతిజనములెల్ల సర్వేశ్వరునకును।
గన్నబిడ్డలగుటఁ గలసిమెలసి।
యన్నదమ్ములట్టులన్యోన్యహితముగా।
మెలగుచుండురేని మేలుగలుగు॥

ఆ॥ గుణములుగలవాని కులమెంచఁగానేల।
• గుణముగలిగ నేనికోటినేయు।
గుణములేనివాని కులమెంత గొప్పైన।
నెంచవలదువాఁడు నీచుడేమ॥

శు॥ జాతిరిచనచర్మణో నరక్తస్యనమాంసస్యన చాస్థినః।
నజాతిరాత్మనో జాతిర్వ్యవహార ప్రకల్పితా॥

తా॥ జాతియనునది దేహముమీదనుండు చర్మమునకును లేదు రక్తమాంసాస్థులకును లేదు ఆత్మకును లేదు వ్యవహారమునకు మాత్రము యేర్పడియున్నది.

"నైతాదృశం బ్రాహ్మణస్యాస్తి విత్తమ్ యథైకతా సమతా సత్యతా చ।
శీలంస్థితిర్దండనిధానమార్జనమ్ తతస్తతశ్చోపరమః క్రియాభ్యః॥

తా॥ ఏకత్వము, సమత్వము, పురాణవాక్యము, సూనృతోక్తి, సదాచారము, స్థిరత్వము, మొదలగువానితో సమానమగు ద్రవ్యము బ్రాహ్మణునకు వేఱొండులేదు.

ఈ లక్షణములతోఁగూడిన జీవుఁడుత్తమ జాతి జీవుఁడనిపించుకొనును. ఏదేశమునందు జన్మించినను ఇట్టి లక్షణములుఁగల జీవులేయగ్రజాతి జీవులని యెన్నఁబడదగుదురు..................అట్లుకానిచో బ్రాహ్మణజాతియందు జన్మించినను బ్రాహ్మణుఁడని యెన్నఁబడుట కర్హుఁడు కాఁడని స్మృతులయందును, పురాణములయందును దృఢముగఁ జెప్పఁబడియున్నయది.......................... జీవుఁడు తాఁబుట్టిన వర్ణమునకు విధించిన బాహ్యధర్మముల ననుష్ఠింపక పోవుట వర్ణసంకరమని సామాన్యముగాఁ జెప్పుచున్నను, జక్కఁగ విచారించినచో జీవుఁడు తన స్వభావమునకు సరిపోలని వర్ణమునందు బుట్టుటయే వర్ణసంకరమని యెఱుంగవలయును ...............యోగ్యతలేక యున్నను జన్మమున మాత్రముత్తమ జాతివారమనియును, పూజ్యులమనియు నెన్నువారందఱు పూజ్యులు కాఁజాలరు. "యథాకాష్ఠమయో హస్తీయథాచర్మ మయోమృగః యశ్చవిప్రోఽనధీయానస్త్రయస్తే నామధారకాః" మనుస్మృతి యథోక్తగుణసంపన్నుఁడుగాని బ్రాహ్మణుఁడును కొయ్యతో జేయబడిన యేనుఁగును, చర్మనిర్మితమగు జింకయును నివియన్నియు నామము మాత్రమే గలవి.......................................... యస్య యల్లక్షణం ప్రోక్తంపుంసోవర్ణాభివ్యంజకం యదన్యత్రాపిదృశ్యేత తత్తేనైవవినిర్దిశేత్"

తా॥ పురుషునకు జాతిసూచకముగనే లక్షణములు చెప్పబడినవో యవి యితరునియందుగూడ గనఁబడునేని యతఁడాజాతివాఁడు.

శ్లో॥ నగోత్రం నకులం సూత్రం నవిభుత్వం నశూన్యతా।
న స్త్రీర్న యోషిన్నోవృద్ధా నకన్యానవితంతుతా॥

తా॥ బ్రహ్మ విద్యాభ్యాసమునకు సహితము గోత్రము కులము సూత్రము గొప్పది చిన్నది స్త్రీ యువతి వృద్ధురాలు కన్య కొవితంతు మొదలుగాగల భేదములులేకయే అనుష్ఠానము చేయవచ్చునని బుభుమహర్షి బోధించెను.

ఏది యెటులున్నను జీవములేని పూర్వాచారడాంబికమునందు తీవ్రమగు అతృప్తిగలిగి మన పరిస్థితులను కాలానుసారముగా అభివృద్ధికాస్పదముగా మార్చుకొనవలెను.

ఈశ్వరపితృత్వమును మానవభ్రాతృత్వమును సర్వజీవ దయాపరత్వమును సన్మతముయొక్క సారాంశములు.

యథేమాంవాచంకల్యాణీ మావదానిజనేభ్యః ।
బ్రహ్మరాజన్యాభ్యాగ్ంశూద్రాయచార్యాయచస్వాయ చారణాయ ॥
యజు. 26 అధ్యా. 2 మం.

అర్థము:- యథా=ఎట్లు, జనేభ్యం=మనుష్యులందఱికొఱకు, ఇమామ్=ఈ, కల్యాణీమ్=శుభము నిచ్చునట్టి, వాచమ్=ఋగ్వేదాది నాలుగు వేదములయొక్క వాణిని. అవదాని=ఉపదేశించుచున్నానో అట్లు మీరును చేయవలయును, బ్రహ్మరాజన్యాభ్యామ్=బ్రాహ్మణ క్షత్రియ, అర్యాయ=వైశ్య, శూద్రాయ=శూద్రులకొఱకును, స్వాయ=తమభృత్యులు స్త్రీలు వీరికొఱకును, అరణాయ=అతిశూద్రులకొఱకును వేదములను ప్రకాశపరచినాను అనిచెప్పఁబడియున్నది జానశ్రుతుఁడను శూద్రుఁడు రైక్యమునివద్ద వేదము నభ్యసించినట్లు చాందోగ్యోపనిషత్తున వ్రాయఁబడియున్నది.

సీ॥ వాత్సల్యమున నాత్మవత్సర్వభూతానియను పల్కుమనమునందరయరయ్య ।
అర్థిజపరోపకారార్థంశరీరమ్ఞ పలుకుమీమదిలోన నిలుపరయ్య ।
కరుణమై బాపాయపరపీడనమ్మను నీతిడెందమునన్ గణింపరయ్య ।
సారిదిసర్వేజనేస్సుఖినోభవంతను ధర్మంబునెదలోన దలపరయ్య ॥

తే॥ మానవుల సర్వసమతను జూడరయ్య ।
కూర్మినందఱమేలును గూర్పరయ్య ।
ప్రేమభావము మనమున నిలుపరయ్య ।
దేశమేలును నెప్పుడు జేయరయ్య ॥

స్వస్తిసర్వేషామ్ సమస్త సన్మంగళానిభవస్తు.

భారతీయులమతము, విజ్ఞానము, సార్థస్వతము, ఇంతవరకు వినాశనము నొందకుండ కాపాడినది బ్రాహ్మణులే. వీరుహిందు సంఘమునందు ఉత్తమవిజ్ఞానవంతులని భావించవలెను. భారతీయులందఱు వారిని ఆదర్శప్రాయులుగాను పూజనీయులుగాను భావించి వారి ఔన్నత్యస్థితికి పోవుటకు ప్రయత్నించవలెను. బ్రాహ్మణులు హిందు సంఘమునకు శిరస్సువంటి వారు వారిని అన్నివిధముల మనము గౌరవించుట పరమధర్మము.

# ఏకదైవసిద్ధాంతము.



తే॥ ఎంచిచూడఁగ సకలప్రపంచమునకుఁ
గర్తసర్వేశ్వరుఁడు వేఱొకండు దైవ।
మెచటలేఁడని తద్భక్తి నెనసిముక్తి।
పదవిఁగొని పాపపుంజంబు వదలుమయ్య॥

పలుదేవతారాధనగాని విగ్రహారాధనగానికూడదు. దేవుఁడొకఁడను సత్య సిద్ధాంతము సాధారణముగా బుద్ధిమంతులందఱును అంగీకరించిన విషయమేగాన దానికై యుక్తులు చెప్పవలసిన దనావశ్యకము. గ్రంథ దృష్టాంతముల మాత్రము కొద్దిగాచూపించెద. యూదుల ప్రామాణికగ్రంథమైన పాతనిబంధనలోని బోధ ద్వితీయోపదేశకాండము 6-అ 4-వ. మోషేప్రవక్త. ఇశ్రాయేలూ వినుము మన దేవుఁడైన సర్వేశ్వరుఁడు అద్వితీయుఁడగు సర్వేశ్వరుఁడు. 2 రాజులు 19-అ. 15-వ, భూమ్యాకాశములు కలుగఁజేసిన అద్వితీయ దేవా నీవు లోకమందున్న సకల రాజ్యములకు దేవుఁడవై యున్నావు. యెషయా 44-అ. 6-వ. నేను మొదటి వాఁడను నేనుతప్ప ఏదేవుఁడునులేఁడు, 9 వచనమున విగ్రహమును నిర్మించు వారందఱు మాయవంటివారు వారికిష్టమైన విగ్రహములు నిష్ప్రయోజనములు. ఇర్మియా 10-అ. 10-వ. సర్వేశ్వరుఁడే నిజమైన దేవుఁడు; ఇర్మి 10-8, ఆయన తన బలముచేత భూమిని సృష్టించెను, తన జ్ఞానముచేత ఆకాశమును ప్రపంచమును స్థాపించెను. తన ప్రజ్ఞచేత ఆకాశమును విశాలపరచెను. 13-వ ఆయన ఆజ్ఞనియ్యగా జలరాసులు ఆకాశమండలములో పుట్టును. భూమ్యంత భాగములలో నుండి గాలిని రావించును. క్రొత్తనిబంధనబోధ, మార్కు 12-29 ఓయిశ్రాయేలూవినుము మన దేవుఁడైన సర్వేశ్వరుఁడు అద్వితీయ ప్రభువు 30-వ నీవు నీపూర్ణహృదయముతోను నీపూర్ణాత్మతోను నీపూర్ణవివేకముతోను నీపూర్ణబలముతోను నీదేవుఁడైన సర్వేశ్వరుని ప్రేమింపవలెననునది ప్రధానమైన ఆజ్ఞయని ఏసు క్రీస్తు బోధించెను. మఱియొకప్పుడు అద్వితీయ సత్యదేవుఁడవైన నిన్ను నీవు పంపిన యేసుక్రీస్తును ఎఱుగుటయే నిత్యజీవమనెను యోహాను 17-3, లో వ్రాయబడినది. ఎఫెసి 4-6 అందరికి తండ్రియైన దేవుఁడొక్కఁడే, 1 కొరింతి 8-4 లోకమందలి విగ్రహము వట్టిదనియు ఒక్కఁడే దేవుఁడుతప్ప వేఱొక దేవుఁడు లేఁడనియు నెఱుగుదుము.

ఋగ్వేదము.

శ్రు॥ అజస్యరూపే కిమపిస్వదేకం॥

అనగా పుట్టుకలేని దేవుఁడొకఁడుఁగలఁడు.

కృష్ణయజుర్వేదము 4-6-2-4.

శ్రు॥ ద్యావాపృథివీజనయన్ దేవఏకః॥

తా॥ భూమ్యాకాశములను సృష్టించిన దేవుఁడొకఁడుఁగలఁడు.

ఋగ్వేదమునందు.

శ్రు॥ నాసదాసీన్నోసదాసీత్ తదానీంనాసీద్రజోనోవ్యోమపరోయత్।
కిమావరీవః కుహకస్యశర్మన్నంభః కిమాసీత్ గహనంగభీరమ్।
నమృత్యురాసీదమృతంనతర్హినరాత్ర్యా అహ్నసీత్ప్రకేతః।
ఆనీదవాతం స్వధయాతదేకంతస్మాద్ధాన్యన్న పరఃకించనాస॥

తా॥ ఆదియందు నభావమైనను భావమైననులేదు. అక్కాలమునపైన అంతరిక్షమైనను నాకాశమైననులేదు అప్పుడు మరణమైనను అమరత్వమైననులేదు. పగలైన రాత్రియైన వెలుఁగైన చీకటియైనలేదు స్వయంభువైన యేకవస్తువు మాత్రము శాంతముగా శ్వాసను విడుచుచుండెను. ఆవస్తువుగాక మరేమియు నుండలేదు. పైననవతల మరేమియు నుండలేదు.

బృహదారణ్యశ్రుతి

శ్రు॥ ఆత్మైవేదం నిత్యరోపాసనంస్యాత్ నాన్యత్ కించిత్స ముపాసీతధీరః॥

దేవుని ఆత్మస్వరూపునిగానెంచి బుద్ధిమంతులు ఆతనినే ఉపాసింపవలెను గాని కించిత్తైనను ఇతరమును ధ్యానించకూడదు.

ప్రశ్నోపనిషత్తు. 4-10.

శ్రు॥ సయోహవైతదచ్ఛాయ మశరీరమనోహితం।
శుభ్రమక్షరం వేదయితే యస్తుసోమ్యసర్వజ్ఞ
..........................భవతి॥

తా॥ ఎవఁడు దానిని ఛాయలేనిది అశరీరి వర్ణములేనిది ప్రకాశముగలది నాశములేనిది అని తెలియుచున్నాడో వాఁడు తెలిసినవాఁడు.

శ్వేతాశ్వతరోపనిషత్తునందు.

శ్రు॥ తతోయదుత్తరతరం తతరూపమనామయం।
యఏతద్విదురమృతాస్తేభవన్త్యథేతరేదుఃఖమేవాపియన్తి॥

తా॥ ఈశ్వరుఁడు శ్రేష్ఠవస్తువులలో నెల్ల శ్రేష్ఠుఁడనియు నిరాకారుఁ డనియు నిరామయుఁడనియు నెవ్వరెఱుగుదురో వారు శాశ్వతసుఖమును పొందుదురు. తదితరులు దుఃఖమునే పొందుదురు.

వాజసనేయోపనిషత్తునందు.

శ్రు॥ అన్ధన్తమంప్రవిశన్తి యేసంభూతిముపాసతే తతో।
భూయఇవతేతమోయే సంభూత్యాగ్ంరతాః॥

ప్రకృతినుపాసించువారు అంధకారమున ప్రవేశింతురు సృష్టిపదార్థముల నుపాసించువారంతకంటెను హీనమైన అంధకారమునఁబడుదురు. దేవుని ననేకముగాఁజూచువారు చెడుట సిద్ధము.

“యోన్యాందేవతాముపాస్తే అన్యోసావన్యోహ మస్మీతినసవేదయథాపశుః” ఎవడు బ్రహ్మమును బాహ్యమందున్నట్లుగలచి అన్యదేవతల నుపాసించుచున్నాడో వాడు పశువు అని యున్నది.

అథర్వముండక 2-2-5.

శ్రు॥ యస్మిన్ద్యౌఃపృథివీచాంతరిక్షమోతం మనస్సహప్రాణైశ్చసర్వైః।
తమేవైకంజానథాత్మాన మన్యోవాచోవిముఞ్చథ అమృతస్యైషసేతుః॥

తా॥ భూమ్యంతరిక్షాదులును సర్వేంద్రియములతో ఈమనస్సును ఏఅక్షరు నివలనమున్నవో అతనిని ఒక్కనినే తెలియుఁడు కొండెపుమాటచెప్పవద్దు ఇతరవాక్కులను విడువుఁడు ఈజ్ఞానమే అమృతత్వమునకు సేతువు అనగా తరణోపాయము.

“నాన్యపంథా అయనాయవిద్యతే” తరించుటకు ఆపరాత్పరుని తెలియుట కంటె అన్యమైన మార్గమింకొకటిలేదు.

శ్రు॥ యతోవాఇమాని భూతాని జాయంతే యేనజాతానిజీవంతి।
యత్ప్రయన్త్యభిసంవిశంతి తద్విజిజ్ఞాసస్వతత్ బ్రహ్మ॥

తా॥ దేనినుండి ఈభూతములు పుట్టుచున్నవో పుట్టిన భూతములు దేనిచేత బ్రతుకుచున్నవో దేనిని ప్రయాసపడి పొందుచున్నవో దానినే తెలిసికొనదగి అదియే బ్రహ్మము. బ్రహ్మమనగా త్రిమూర్తులలో నొకడుగానండు బ్రహ్మగాడు. ఉపనిషత్తులలో దేవుని బ్రహ్మమని చెప్పుచువచ్చిరి.

కఠోపనిషత్తు 2:12.

శ్రు॥ తందుర్దర్శంగూఢమనుప్రవిష్టం గుహాహితంగహ్వరేష్టం।
పురాణం అధ్యాత్మయోగాధిగమేవదేవం మత్వాధీరోహర్షశోకౌజహాతి॥

తా॥ అధ్యాత్మ యోగము చేతనే చూడదుర్లభమై లోతు తెలియరానిదై ప్రవేశింపగూడని స్థలమున గలదై అనాదియైయుండు దేవుని ధ్యానించు బుద్ధిమంతులు హర్షశోకములను వర్జించెదరు.

శ్రు॥ ఏకోవశీసర్వభూతాంతరాత్మా ఏకంరూపంబహుధాయః।
కరోతితమాత్మస్థంయేను పశ్యన్తిధీరాః తేషాంసుఖంశాశ్వతంనేతరేషాం॥

తా॥ సర్వభూతములలో నంతరాత్మయై ఒకరూపమును బహువిధముల చేయువాడై యుండెడు అద్వితీయుడగు నీశ్వరుని అంతర్యామిగా తెలియు బుద్ధిమంతులకు మాత్రమే శాశ్వతసుఖము. ఇతరులకులేదు.

శ్రు॥ నిత్యోనిత్యానాం చేతనశ్చేతనానాం ఏకోబహూనాంయోవిదధాతి।
కామాన్ తమాత్మస్థంయేనుపశ్యన్తిధీరాః తేషాంశాన్తిశ్శాశ్వతీనేతరేషాం॥

తా॥ నిత్యములలో నిత్యమై చేతనులలో చేతనమై అనేకములలో నేకమై నిలిచి ఎవ్వడు మనకభీప్సితముల నొసగుచున్నాడో అతనిని అంతర్యామిగా తెలిసికొను బుద్ధిమంతులకు మాత్రమే శాశ్వతమైన శాంతి. ఇతరులకులేదు.

బ్రహ్మానందవల్లి 7 అనువాకము.

శ్రు॥ యథాహ్యేవైష ఏతస్మిన్ అదృశ్యేనాత్మ్యేనిరుక్తేనిలయనే।
భయంప్రతిష్ఠాంవిన్దతే అథసోభయంగతోభవతి॥

తా॥ ఎప్పుడొకడు అదృశ్యఅశరీరి అనిర్వాచ్యనిరాలయ (బ్రహ్మము)ను స్థిరముగా శరణుజొచ్చునో అప్పుడతడు భీతిలేనివాడగుచున్నాడు.

హిందువులందరి చేతను పరమోత్కృష్టముగా నంగీకరింపబడుచున్న వేదములు ఉపనిషత్తులు దేవుడొకడనియు అతనినే సేవించవలయుననియు పలుదేవతారాధనగాని విగ్రహారాధనగాని కూడదని మొఱలిడుచున్నవి. శబ్దప్రమాణములలో కడపటివైన పురాణములను విచారింతము.

భాగవత తృతీయస్కంధమున.

శ్లో॥ అహంసర్వేషుభూతేషుభూతాత్మావస్థిత సదా।
తమజ్ఞానహంమర్త్యః కురుతేర్చా విడంబనమ్॥
యోమాంసర్వేషు భూతేషుసంతమాత్మానమీశ్వరమ్।
హిత్వార్చాంభజతే మౌఢ్యాద్భస్మన్యేవజుహోతిసః॥

తా॥ నేను సకల భూతములయందును ఆత్మస్వరూపుఁడనై యుండగా అట్టి నన్నవమానపఱచుటకై మనుజుఁడు విగ్రహార్చనయను పరిహాసము చేయుచున్నాఁడు. సర్వభూతములయందును ఆత్మస్వరూపిగానుండు ఈశ్వరుఁనైన నన్నువిడచిమౌఢ్యము చేత నెవఁడు అర్చనసుఁజేయు చున్నాఁడో వాడు బూడిదలో హోమము చేయు వాఁడే యగును.

ఉత్తరగీతలు 3 అధ్యా. 5 శ్లో.

శ్లో॥ తీర్థానితోయరూపాని దేవాః పాషాణమృణ్మయాః।
యోగినేప ప్రపద్యంతే ఆత్మధ్యానపరాయణాః॥

ఆత్మధ్యానపరాయణులగు యోగులు ఉదకములను తీర్థములనియు మట్టి తోను రాళ్ళతోనుఁ జేయఁబడిన విగ్రహములను దేవుళ్ళనియు భావింపరు. మానవుని కిహపరముల రెంటియందును కలుగఁదగిన అభివృద్ధి ఆనందములన్నియును జగత్కారణ కర్తయు మోక్షదాయకుఁడునై ప్రేమాస్వరూపిగానుండు పరమాత్మయు పాసనవలనఁగాక అన్యత్ర ఏనాటికినిఁ గలుగదు. సర్వేశ్వరుని నిజమైన ఆత్మారాధనవలన ధ్యానించవలెనేఁగాని నాతనికి మనుజునకు మధ్యవేరొండు ప్రతిమనుఁగల్పించి అడ్డుపెట్టి ప్రతిమార్చన ద్వారానాతని మెప్పుఁగుఁజేసికొనుట కడుమూఢత్వమనఁదగియున్నది. స్వామి రూపములేనివాఁడుఁ గనుక నాతని ప్రతిరూపముండుటయే అసాధ్యముగాన విగ్రహము లెప్పుడును ఈశ్వర రూపసాదృశ్యమును పొందఁజాలవు. "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" నిత్యస్వయం ప్రకాశ నాశరహితమైననే బ్రహ్మము "యత్సత్యంతదృబ్రహ్మ" ఏదిసత్యమో అదేబ్రహ్మము,

శ్లో॥ అహింసా ప్రథమంపుష్పం పుష్పమింద్రియ నిగ్రహః।
సర్వభూతదయా పుష్పంక్షమా పుష్పం విశేషః।
శాంతిపుష్పంతపః పుష్పంధ్యానపుష్పంతథైవ చ।
సత్యమష్టవిధం పుష్పందేవో ప్రీతికరంభవేత్॥

తా॥ 1 అహింస, 2 ఇంద్రియ నిగ్రహము, 3 దయ, 4 క్షమ, 5 శాంతము, 6 తపము, 7 ధ్యానము, 8 సత్యము ఈ అష్ట విధపుష్పములుగల మానసిక పూజ దేవునికి ప్రీతికరమైనది.

ఆ॥ సకల భువనకర్తసర్వేశ్వరుండమ్మ।
పొత్తుకొద్దిదలచునది యవశ్య। మగుధరిత్రి........॥

అన్నటుల లోకముల కన్నిటికి కర్తగానుండు సర్వేశ్వరుఁడొక్కఁడే దైవము ఆయన ఆజ్ఞప్రకారమే జరుగునుగాని వేరొద్దియుగాదు.

గరుడ పురాణము.

"సర్వజ్ఞస్సర్వకర్తాచ సర్వేశోనిర్మలోద్వయః"

సర్వజ్ఞుఁడు, సర్వకర్త, నిర్మలుఁడునైన దేవుఁడొకఁడు గలఁడు.

అగ్నిపురాణము,

"జ్యోతిర్ జ్ఞానంపరబ్రహ్మ ఏకమేవాద్వితీయకం"

జ్యోతి స్వరూపుఁడును జ్ఞానానందుఁడైన పరబ్రహ్మ ఒకఁడు వుంచున్నాఁడు

కం। సకలాకారుఁడనంతుఁడు।
సకలాత్మలయందు సర్వసాక్షియుండానై ।
సకలమున నిర్వికారుం।
డకళంకస్థితిని బ్రహ్మమనఁబడు వేమా ॥

శ్లో॥ తదేవనిత్యం జ్ఞానమనంతం ఈశస్స్వతంత్రం నిరవయమేక మేవాద్వితీయం। సర్వవ్యాపి సర్వనియంత్రు సర్వాశ్రయసర్వవిద్ సర్వశక్తిమత్ ధ్రువం సంపూర్ణమప్రతిమమ్ ॥

తా॥ దేవుఁడు నిత్యుఁడు, సమస్తము నెఱుగువాఁడు, ఆద్యంత రహితుఁడు, ప్రభువు, స్వతంత్రుఁడు, అశరీరి. ఒక్కఁడైయుండువాఁడు, సర్వవ్యాపి, అన్నిటి కాధారమైనవాఁడు అజ్ఞానలక్షణముల కంటనివాఁడు. వికారరహితుఁడు, సర్వ శక్తి మంతుఁడు, ఊనికిపట్టు, సంపూర్ణమైనవాఁడు సాటిలేనివాఁడునైయున్నాఁడు యిట్టివాఁడు దేవుఁడు,

పరబ్రహ్మనిరాకారుఁడని హిందూమతమును దేవుఁడు ఆత్మస్వరూపియని క్రైస్తవమతమును చెప్పుచున్నవి. శిల్పిమనుష్యుని దేహమునుఁ బోలియుండు విగ్రహమును చెక్కఁగలఁడుగాని అతని ఆత్మనుఁబోలియుండు విగ్రహమును చేయఁ జాలడు. తద్వతుగానే అశరీరియైన పరమాత్మనుఁ బోలియుండు రూపము చెక్కఁజాలఁడు.



# బూతు బొమ్మలు.

---

మెట్టవేదాంతులు కొందఱు గుళ్లమీఁదను రథములమీఁదను మిక్కిలి యేహ్య మైన బూతుబొమ్మలను చెక్కించి తామేమో అందువలన వైకుంఠమున కరుఁ దెంతుమని భ్రాంతిపడుచున్నారు. ఈబొమ్మల దర్శన మాత్రముననే యౌవనులైన స్త్రీ పురుషులకు దుస్సంకల్పములనుఁ గలిగించి మిక్కిలి కామోద్రేక తలంపుల పుట్టించి అమాయకులైన యాత్రికుల హృదయములను దుర్నీతికి పాలగునట్లు చేయుటతప్ప వేరెద్దియులేదు. లోకములో నెంత అనాగరికుఁడైన మూఢుఁడైనను యింత అవమానకరమైన పటములను వ్రాసియుంచుకొనఁడు. యాత్రికుల మనముల కెక్కునట్లు నీతిబోధించుటకు మాఱుగా దుశ్శీలప్రేరితమున కాస్పద మైన బూతుబొమ్మలను చెక్కించి జనుల హృదయములలో పాపకార్య బీజాంకుర ములుద్భవింపఁజేయు మహనీయులను దేవుఁడు మెచ్చునా? వారు భ్రమపడినట్లు పరమపదవి దయచేయునా? పెడయుక్తులు కల్పింపనుఁబూను కొనక న్యాయమైన బుద్ధితో నాలోచింతురుఁగాక.

ఓ జగదీశ్వరా మాదేశమందలి దురాచారములు సహోసదాచారములుగా భావించుకాలము తొలఁగు నట్లనుగ్రహింపుము.

తే॥ నేను సేవించు దేవుఁడు నీతిశుద్ధ।
సత్యముల చేత భాసిల్లు సర్వశక్తుఁ।
డతని వాక్యము నమ్ముగుననుదినంబు।
జగముఁ బ్రోవంగ నాతఁడే జయవిభుఁడు॥

తే॥ ఇలనుమాకిమ్ము నీతలం వెలమిగల్గ।
నంటుగట్టుము నీయధిక వాక్య।
మనెడు మాకంద వాఖతో నధిక సేవ।
యపుడు ఫలమిచ్చి వినుతింతునవని నిన్ను॥

తే॥ నావిమోచక విశ్రాంతి సాధనంబ।
నీవు నన్నుండఁజేయుము నీదుపజ్జ।
నపుడునొందెద ధన్యత నధికముగను।
మిగులనాశించు నాయాత్మ వేఁలునొంది॥

---

17

# తీర్థయాత్రలు.

---

భారతాశ్చర్యపర్వము.

శ్లో॥ నజలాప్లుత దేహస్తుస్నాత ఇత్యభిధీయతే।
సస్నాతోయోదమస్నాతస్సతు శుద్ధతమోమతః॥

ఉదకముచేత తడపఁబడిన దేహముగలవాఁడు స్నానము చేసినవాఁడని చెప్పఁబడును. ఎవఁడు దమమనియెడు తీర్థమునందు స్నానము చేయునో అట్టి వాఁడు మిగుల పరిశుద్ధుఁడగును. దమ మనగా అంతరేంద్రియ నిగ్రహము.

శ్లో॥ నశరీరమలత్యాగాన్నరోభవతి నిర్మలః॥

దేహమునందలి మురికి పోవుటవలన నిర్మలుఁడుగాఁడు,

శ్లో॥ చిత్తమంతర్గతందుష్టం తీర్థస్నానైర్నశుద్ధ్యతి।
శతశోథజలైర్ధౌతం సురాభాండమివాశుచిః॥

కల్లుకుండ వేయిమారులు నీటితో శుద్ధిచేసినను పరిశుద్ధముకాని విధముగ లోపల దుష్టగుణములుఁగల మనస్సుగలవాఁడు తీర్థస్నానముచేత పరిశుద్ధుఁడుగాఁడు.

బ్రహ్మపురాణము 57 అధ్యాయమునందు.

శ్లో॥ గంగాతోయేనకృత్స్నేనమృద్భారైశ్చనగోపమైః।
ఆమృత్యోఃస్నానకశ్చైవ భావదుష్టోనశుధ్యతి॥

వొకఁడు తానుమృతిపొందే వఱకు కొండంతమన్ను ఎత్తితనదేహమునకు పూసికొని గంగానది నీరంతయు తలమీద పోసుకొన్నప్పటికిని వాఁడు శుద్ధుఁకా నేరఁడు.

విష్ణుసహస్రనామ శంకరభాష్యమునందు.

శ్లో॥ జ్ఞానహ్రదేధ్యానజలేరాగద్వేష మలాపహే।
యస్నాతిమానసే తీర్థేసయాతి పరమాంగతిమ్॥

సకల పాపములను బోగొట్టునట్టి జ్ఞానమనియెడు మడుగునందుండెడి ధ్యానమడియెడు జలమునందు స్నానముఁ జేసినవాఁడు సర్వోత్తమమైన గతినిపొందును.

భారతాశ్చర్యపర్వమునందు.

శ్లో॥ ఏభజంతి......................మహేశ్వరం।
నతేభ్యోవిద్యతేతీర్థమధికం రాజసత్తమ॥

లోకములో ఎవరు సర్వేశ్వరుని ధ్యానముచేయుదురో అట్టివారికి నధికమైన తీర్థమేదియునులేదు,

రామస్తవరాజమునందు.

గీ॥ రామకీర్తన సరిసాటి భూమిఁగలదె।
తెలియనేరని మూర్ఖులు తీర్థయాత్ర।
లంచు దేవతా సేవలటంచునుండి।
బట్టుకతిరుగు గ్రహచారబాధఁగాక॥

భగవంతునియందు భక్తివిశ్వాసములులేనివానికి యాత్రలవలన నించుకైనను లాభముండదు. భగవంతునియందు భక్తివిశ్వాసములుగలవానికి యాత్రలుచేయవలసిన యావశ్యములేదు. తన మనఃకమలము ఈశ్వరార్పితముఁ జేయకున్న బహుదేశ సంచారముఁజేసినను సుఖము దొరకదు.

---

# యజ్ఞము (బలి)

భారతశాంతి పర్వము.

కం॥ వినుపశుయజ్ఞము హింసన। మనంతఫలదంబుగా దహంకృతిసహితం।
బనఘా వాఙ్మనసమయం। బను యాగంబిచ్చు నవ్యయానందంబున్ ॥

తా॥ పశుయజ్ఞము హింసాకరంబైనది; అహంకారమైనది; వాఙ్మనస్సహితంబుగా ఆత్మయజ్ఞము అవ్యయానంద మిచ్చును.

భాగవతమున.

చ॥ తపములఁజేసినైన మతిదానము లెన్నియుఁజేసినైన నే।
జపములఁజేసినైన ఫలసంచయ మెవ్వనిఁజేర్పకున్న హే।
యపదములై దురంత విపదంచితరీతిగ నొప్పుచుండు న।
య్యపరిమితున్ భజించెద నఘౌఘనివర్తను భద్రకీర్తనున్ ॥

బైబిలునందిలాగున్నది.

తాను సెలవిచ్చిన ఆజ్ఞను ఒకఁడు గైకొనుటజూచి సర్వేశ్వరుఁడు సంతోషించునట్లు ఒకఁడు దహన బలులను అర్పించుటఁజూచి ఆయన సంతోషించునా? I సమూ. 15-22. నీవు బలులను కోరువాఁడవుకావు. దహనబలులు నీకిష్టమైనవి గావు కీర్త 51-16. విరిగిన మనస్సే దేవుని కిష్టమైన బలులు 17-వ. పశువును వధించువాఁడు నరుని చంపువాఁడే. యెష. 66-3. ఏమితీసికొనివచ్చి సర్వేశ్వరుని నేను దర్శింతును... ..................................న్యాయముగా నడచుకొనుటయు దయచూపఁ గోరుటయు దీనమనస్సుఁగలిగి నీదేవుని యెదుట ప్రవర్తించుటయు; ఇంతేగదా సర్వేశ్వరుఁడు నిన్నడుగుచున్నాఁడు మీఖా. 6-6-8. కనికరమునే గోరుచున్నాను గాని యజ్ఞమును నేను కోరను. మత్తయి. 12-7. "భూతబలికంటె పాపంబు భూమిలేదు" అనియొక కవి. జంతువులను దేవార్పితమని చంపుట గొప్పపాపమని భావము నీతిన్యాయముల ననుసరించి నడచుకొనుట బలులనర్పించుటకంటెను సర్వేశ్వరుని కిష్టము. సామెతలు. 21-3.

## ౨౦

# దానము.



విశ్వాసగృహమునకు చేరినవారి యెడలను మేలుచేయుదము గల 6-8-10 వెదజల్లి అభివృద్ధిపొందువారు కలరు తగిన దానికన్న తక్కువనిచ్చి లేమికి వచ్చువారుకలరు ఔదార్యముగలవారు పుష్టినొందుదురు. నీళ్లుపోయువారికి నీళ్లుపోయఁబడును సామె॥ 24-25 కొంచెముగా విత్తువాఁడు కొంచెముగా పంటకోయును సమృద్ధిగావిత్తువాఁడు సమృద్ధిగాపంటకోయును II కొరిం 9-8 ప్రభువా! ప్రభువా! యని నన్ను పిలుచు ప్రతివాఁడు పరలోక రాజ్యములో ప్రవేసింపఁడుగాని పరలోకమందున్న నాతండ్రి చిత్తప్రకారము చేయువాఁడే ప్రవేసించును. మత్త 7-21 అవిమంచివైనను సరే చెడ్డవైననుసరే. తానుజరిగించిన క్రియలచొప్పున దేహముతోఁ జేసినవాటి ఫలమును ప్రతివాఁడును పొందును, దానమనగా తనకున్న దానిని ఇతరులకు బుద్ధిపూర్వకముగా నిచ్చుట "దానమేవగృహస్థానాం" సంసారులకు పద్ధతికి దానమే మూలము.

శ్లో॥ దానేనశత్రూన్ జయతివ్యాధిర్దానేననశ్యతి।
దానేనలభ్యతేవిద్యా, దానేనయువతీజనః।
ధర్మార్థకామమోక్షాణాం సాధనంపరమంస్మృతం॥

దానమువలన శత్రుజయముఁగలుగును రోగములు శాంతిఁబొందును. విద్యాలాభముఁగలుగును. కల్యాణకార్యములు వర్ధిల్లును ధర్మార్థకామమోక్షములను పురుషార్థములకది పరమసాధనమై యొప్పుచుండును.

తైత్తిరీయోపనిషత్తు.

శ్లో॥ దానయజ్ఞానాంవరూథం........,దానేనద్విషంతోమిత్రాభవతి।
దానేసర్వం ప్రతిష్ఠితంతస్మాద్దానం పరమంవదంతి॥

అన్నియజ్ఞములలో దానను శ్రేష్ఠమైనది దానముచేత పగవారు స్నేహితులగుదురు. దానమువలని ఆధారమువలన జగత్తు నిలిచియున్నది, కావున దానము శ్రేష్ఠమైనది. బావులు త్రవ్వించుట సత్రములు కట్టించుట బీదలకు అంగహీనులకు శరీరదార్ఢ్యము తఱిగి దిక్కులేని ముదుసలులు మొదలైనవారికన్న దానము చేయుట, వస్త్రదానముచేయుట మొదలైన సత్కార్యములు ప్రాణికోటికి తృప్తిఁగలిగించునుఁగాన ఇష్టీవిసదుద్దేశముతో జేసినయెడల ఫలముఁగలుగుననుటకు సందే

హాము లేదు. "ఎవఁడీ చిన్నవారిలో నొకనికి గిన్నెడు చన్నీళ్ళు మాత్రము త్రాగ నిచ్చునో వాఁడు తనఫలము పోఁగొట్టుకొనడని నిశ్చయముగా మీతో చెప్పు చున్నాను" మత్తయి 10:42.

భారతాశ్వార్యపర్వమునందు.

శ్లో॥ తేజః ప్రజ్ఞాంబలం వీర్యంక్షున్నాశయతిదేహినాం।
యోదుర్జయాంతాంజయతి తేన స్వర్గోజితోభవేత్ ॥

ఆకలియనునది జంతువులయొక్క తేజస్సు, ప్రజ్ఞ, బలము, మొదలైన. వానిని నసింపఁజేయును జయింప శక్యముఁగాని (తాళుకొనుటకు సాధ్యముఁగాని) పరుల యాకలినిఁ దీర్చువాఁడు స్వర్గలోకమును అనాయాసముగా జయించును ఆకలిఁగొన్నవారందఱు అన్నదానమున కర్హులు.

శ్లో॥ కింతస్యజీవితం ఫలంప్రాప్తోయస్యాశయాతిథిః।
శూన్యాదివగృహాద్దీనోనిత్యశః ప్రతిగచ్ఛతి॥

ఎవనియింటివద్దనుండి అతిథి (దానమునకు వచ్చినవాడు) నిరాశుఁడును దీనుఁడునై పోవుచున్నాఁడో అతనియొక్క జీవిత ఫలము వ్యర్థమైనది.

శ్లో॥ అధ్వశ్రాంత మవిజ్ఞాతమతిథింక్షుత్పిపాసితం।
యోనపూజయతే భక్త్యాతమాహుర్యాత్మఘాతుకమ్॥

తా॥ మార్గాయాసమునుఁ బొందినవాడును ఆకలిదప్పిచేత పీడింపఁబడువాఁడును అయిన యతిథిని ఏమానవుఁడు పూజింపఁడో వాఁడు బ్రహ్మఘాతకుఁడనఁబడును.

ఆ॥ పెట్టిపోయలేని వట్టినరులు భూమి।
పుట్టనేమివారు గిట్టనేమి।
పుట్టలోని చదలు పుట్టదా గిట్టదా॥విశ్వ॥

కల్పనామాధ్య దేవతలకు దాసులై ద్రవ్యము సద్వినియోగముచేయక జాతరలని పేరుపెట్టి నూర్లాది వ్యయపరుచుచు నిరర్థకులై మేషకుక్కుటాదులను విగ్రహములకు బలియిచ్చుచు కల్లు సారాయములుత్రాగి చిందులుద్రొక్కి దుర్వ్యయము చేయుటయే గొప్పతనముగాభావించుచు దానధర్మములకొక గుడ్డిగవ్వయైన నీయరు. ఇదిమిక్కిలి శోచనీయము.

ఆ॥ దానధర్మములను తగ చేపు నేడని।
కాలలయము చేయు కష్టనరుఁడు।
తానుయేమియౌనొ తన బ్రతుకేమౌనొ॥విశ్వ॥

"పరోపకారార్థమిదంశరీరమ్" ఈదేహము ఇతరుల హితముకొఱకు అను న్యాయము దానమువలననే నెరవేరుచున్నది "ఒక సహోదరుడైనను సహోదరి యైనను దిగంబరులై ఆనాటికి భోజనము లేక యున్నప్పుడు మీలో నెవడైనను శరీరమునకు కావలసినవాటి నియ్యక సమాధానముగా వెళ్ళుడి................... తృప్తిపొందుఁడని చెప్పిన యెడల నేమి ప్రయోజనము" యాకోబు 2:15, 16; "మీకు కలిగినవి ధర్మము చేయుడి అప్పుడు మీకన్నియు శుద్ధిగానుండును" లూకా 11:41.

భారతము.

శ్లో॥ న్యాయాగతేనద్రవ్యేణ కర్తవ్యంపారలౌకికం॥

సత్కార్యము లేవిచేసినను న్యాయమార్గమువ సంపాదించిన ద్రవ్యముతోఁ జేయవలయును. "తానుతిన్నదేకాదు ఇతరులకు పెట్టినది తనపాలు" అనుసామెత వట్టిదికాదు.

శ్లో॥ యథేరిణా బీజముప్త్వానవప్తాలభతేఫలమ్।
తథాఽనృచేహవిర్దత్త్వానదాతాలభతేఫలమ్॥

తా॥ ఊషరక్షేత్రమున విత్తనము వేయువాఁడు ఫలమును పొందఁజాలని విధముగా అసత్యవంతుఁడగువానికి దానముచేసిన దాతయు దానమువలని ఫలమును పొందఁజాలఁడు.

శ్లో॥ యద్దదాసివిశిష్టేభ్యోయచ్చాశ్నాసిదినేదినే।
తత్తేవిత్తమహంమన్యే శేషంకస్యాపిరక్షసి॥

తా॥ ఏధనమును యోగ్యులకు దానము చేయుదువో, దేనిని ప్రతిదినము అనుభవింతువో అదియేనీదగును; మిగిలినదినీదికాదు దానిని నీవు కాపాడుచున్నావు సత్యవేదమున "అందుకుయేసు—పరిపూర్ణుఁడగుటకు నీవు కోరినయెడల, పోయి నీఆస్తినిఅమ్మి బీదలకిమ్ము అప్పుడు పరలోకమందు నీకు ధనముకలుగును; మత్తయి 19:21. మఱియు "అప్పుడురాజు తన కుడివైపునయున్న వారిని చూచి—నాతండ్రిచేత ఆశీర్వదించఁబడిన వారలారారండి; లోకము పుట్టినది మొదలుకొని మీకొఱకు

సిద్ధపరచఁబడిన రాజ్యమును స్వతంత్రించుకొనుడి నేనాకలిగొంటిని మీరు నాకు భోజనము పెట్టితిరి; దప్పిఁగొంటిని నాకు దాహమిచ్చితిరి. పరదేశినై యుంటిని నన్ను చేర్చుకొంటిరి దిగంబరినై యుంటిని నాకు బట్టలిచ్చితిరి, మొదలగు నీతి బోధలు మత్త 25-34, 35 వచనములు. ఇవన్నియు మానవులకు చేసిన తనకుచేసి నట్టే యగుననికూడా యేసు నాథుఁడు బోధించియున్నాఁడు। "మిక్కిలి అల్పులైన ఈనాసహోదరులలో నొకనికి మీరు చేసితిరి గనుక నాకుచేసితిరని నిశ్చయముగా మీతో చెప్పుచున్నానని వారితోఁ చనెను. మత్తయి 25 - 40 వ నిండు మనస్సుతో యోచించిన మానవజీవిత పరమార్థరహస్యము పరోపకారమును సదుద్దేశముతోఁ జేయు దానమునందే గుప్తపరచఁబడి యున్నదనుట యతిశయోక్తిఁగాదు. మనవద్ద నుండు వస్తువులు యుచితరీతిని దేశకాల పాత్రత చక్కఁగా నెఱింగి ఎప్పటికేది యవసరమో దాని నితరులకిచ్చుట దానము. ఇక్కఁడ సోమరులకందఱకు యథేచ్ఛగా ఇవ్వవలయుననిఁగాదు. అట్టివారు సోమరితనమును వీడి కాయకష్టపడి సంపాదించుకొనుట విధికృతము పనిచేయనివారు ఆహారము తినుటకు యోగ్యులు కారు సోమరిపోతులై కాయకష్టములుమాని యాచనవృత్తియే నాధారపఱచుకొని జీవించు వారికిని, దుర్మార్గులకును దానముచేసిన సోమరితనమును దుర్మార్గమును మఱింత ప్రబలిజేసి నర్థకమగునుఁగాన అట్టివారికి దానము చేయకూడదు.

కాయపుష్టిఁదొలగిన వానికిని అంగహీనునకును. విపద్దశలో నున్న వారికిని, యథేచ్ఛగా దానము చేయుట ధర్మము. "పాత్రతెఱుగని దానము బంగారు చేటురా" యను వేమనయోగి సిద్ధాంతము అంగీకరించఁదగినది. "తృణాదపిలఘు స్తూల, స్తూలాదపిఛయాకః" గడ్డికంటె| తేలికైనది దూది దూదికంటె చులకన యాచకుడు అనియున్నదిఁగావ దేహదార్ఢ్యముఁగలిగి అంగసౌష్టవముఁగల యేజాతి వాఁడైనను చులకన (నీచమైన) యాచనవృత్తిని మాని కష్టపడి స్వార్జితముతో జీవించవలెను. దానము చేయుదానియందు లక్ష్యముంచి "శ్రద్ధయాదేయం" అన్నట్లు శ్రద్ధతోను "సంవిదాదేయం" అనురీతి తెలివితోను దానము చేయవలెను.

దానములలో విద్యాదానము సహొకడుగొప్పది. "విద్యాదానం విశేషతః" విద్యాదానము శ్రేష్టమైనది. "అన్నేనక్షణికాతృప్తి యావజ్జీవంతు విద్యయా" అను రీతి అన్నముక్షణకాలము అనగా కొద్దికాలము మాత్రమే తృప్తికలుగఁ జేయునుఁగాని విద్యజీవితకాలమంతయు నుపయోగించునుఁగాన విద్యాదానము శ్రేష్ఠమైనది.

శ్లో॥ సర్వేషామేవదానానాం జ్ఞానదానం పరంస్మృతః ॥

సమస్త దానములలో జ్ఞానదానము మిక్కిలి శ్రేష్ఠము. లోకమున కత్యంత మేలుఁజేయు జ్ఞానమును బోధించువారికి గృహస్థులు తప్పక ఆతిథ్యమియ్యవలెను. మీ కొఱకు ఆత్మసంబంధమైనవి మేము విత్తియుండగా మీవలన శరీరసంబంధమైన ఫలములుకోసి కొనుట గొప్పకార్యమా I కొరింథి 9 అ 11 వ.

నాపేరట మీకు గిన్నెడు నీళ్లు త్రాగనిచ్చువాఁడు తన ఫలమును పోగొట్టు కొనడని మీతో నిశ్చయముగాఁ జెప్పుచున్నాను. మార్కు 9 - 41.

అని యున్నదిగాన మనముచేయు దానధర్మములు స్వామికర్పించి ఆయన పేరటనే చేయవలెను. జనోపకారము నిమిత్తమును ఆత్మలప్రయోజనమునకును పని చేయుచుండు సమాజములకును సహాయముచేయుట ప్రతిమనుజుని విధియైయున్న దనుట మరువరాదు. స్వామికార్యార్థము ఇచ్చు ఈవి సత్ఫల మొసఁగును.

తే॥ సంపదలుగోరి మ్రొక్కుచు స్వామికెపుడుఁ।
దనకుస్వామియొసంగిన ధనమునందు।
స్వామికైశక్తికొలఁది నొసంగఁడేని।
వానికంటెఁగృతఘ్నుండు వసుధఁగలఁడె॥

“సత్క్రియను ఓపికగాచేయుచు మహిమను ఘనతను అక్షయతను వెదకు వారికినిత్య జీవమునిచ్చును” రోమా 2-7. దీదలను కటాక్షించువాఁడు ధన్యుఁడు కీర్తన 41-2.

ఆ॥ ఏమిఁగొంచువచ్చె నేమిదాఁగొనిపోవుఁ।
బుట్టువేళనరుఁడు గిట్టువేళ।
ధనములెచటికేగు తానేగునెచటికి॥ విశ్వ॥

శ్లో॥ ఆత్మప్రాణైః పరప్రాణాన్యోనరః పరిరక్షతి।
సయాతిపరమంధామయతో నావర్తతేపునః॥

ఎవఁడు పరుల ప్రాణమును తన ప్రాణముచేత కాపాడునో అట్టి మానవుఁడు పునరావృత్తిరహితమైన స్థానమునుఁబొందును. తన ప్రాణ మొసగి పరులప్రాణములను నరకబాధనుండి తప్పించి కాపాడినవాఁడు యేసుస్వామి మాత్రమే అనిబైబిలు నందున్నది “దేవుని కృపననుసరించి ఆయన ప్రతిమనుష్యునికొఱకు మరణము ననుభవించునట్లు దూతలకంటె కొంచెము తక్కువవాఁడుగా చేయఁబడిన యేసు

మరణము పొందినందున మహిమాప్రభావములతో కిరీటము ధరించిన వానిగా ఆయనను చూచుచున్నాము. "యేసుక్రీస్తుయొక్క శరీరమొక్కసారియే అర్పింపఁబడుటచేత ఆచిత్తమునుఁబట్టి మనము పరిశుద్ధపరచఁబడి యున్నాము. హెబ్రి 10-10 క్రైస్తవులమని చెప్పుకొనువారు క్రీస్తుజూపినదారిలో నడచువారు బహు కొద్దిమందియైనానుందురా? సందేహము. "ఇదినా రక్తము, అనగా పాపక్షమాపణ నిమిత్తము అనేకులకొఱకు చిందింపఁబడుచున్న నిబంధనరక్తము. మ, 26 అ 28వ.

శ్లో॥ దేయమార్తస్యశయనం స్థితిశ్రాంతస్యచాసనం।
తృషితస్యచపానీయం క్షుధార్థస్యచభోజనమ్॥

ఆర్తుఁడగు వానికి శయ్యను అలసినవానికి పీఠము దప్పిఁగొన్నవానికి దాహోదకమును ఆకలిఁగొన్నవానికి భోజనమును పెట్టవలయును. అనురీతి ఏసమయమునకేది ఆవసరమో గుర్తెఱిగి అదియే దానము చేయవలయును. ధనికు లనేకులు బీదలకు సహాయము జేసెదమని గొప్పఁజెప్పి వెట్టిసేవచేయించుకొని తుదకు.

శ్లో॥ రేపుమాపు సహస్రాణి। మాపురేపు శతాయచ।
ఇదిగో అదిగో యిస్తాను। ఇత్యేతే ఇవ్వనిలక్షణమ్॥

అనెడి సామెతకు దిగివారికేమియు నియ్యక ఉస్సురనిపించుట మిక్కిలి శోచనీయముగా నున్నది,

"మనోదత్తంచవాగ్దత్తంధారాదత్తంతథైవచ" అను రీతి సంకల్పించుట, చెప్పుట, చేతితో నిరూపించుట ధారపోయుట మొదలగునవన్నియు వాగ్దత్తములే యగును.

మాలమాలఁగాఁడు మహిమీఁద నీ ప్రొద్దుమాట దిరుగువాఁడు మాలగాని॥ వేమ॥

గీ॥ భువిని మనుజుఁడు తన సౌఖ్యమునకెగాక।
పరులకయిఁ గూడబుట్టింపఁబడిన కతన।
స్వార్థపరతను విడనాడి సర్వజనులు।
నొండొరులకై శ్రమపడుచుండవలయు॥

శ్లో॥ విద్యావివాదాయధనం మదాయశక్తిపరేషాం పరపీడనాయఖలస్య।
సాధోర్విపరీతమేతత్ జ్ఞానాయదానాయచరక్షణాయ॥

తా॥ దుర్మార్గుఁడు విద్యఁగలిగియున్న (పనికిరాని) వివాదములను జేయును, ధనముఁగలిగియున్న మదించియుండును, దేహబలముఁ గలిగియున్న

యితరులను, పీడించును (యన్నట్లుండక) సాధువులైనవారు విద్యవలన జ్ఞానము సంపాదించుకొందురు, ధనముఁగలిగియున్న దానము చేయుదురు. దేహబలముఁ గలిగియున్న ఇతరులను రక్షించుచుగురు. (అనురీతిగా నడచుకొనవలెను.)

శ్లో॥ శ్లోకార్థేనప్రవక్ష్యామియదుక్తం గ్రంథకోటిభిః ।
పరోపకారః పుణ్యాయపాపాయపరపీడనమ్ ।

పరోపకారమే పుణ్యము పరపీడనమే పాపము ఇదియే సర్వశాస్త్రసారము.

"మనుష్యుఁడేమి విత్తునో అపంటనే కోయును" అని సత్యవేదము. మఱియు నీతిమంతుఁడు వెనుకదీయక ఇచ్చుచుండును. సామె 21-26.

క॥ ఇచ్చెఁడి వారల సంపద । హెచ్చెఁడి నేఁగానిలేమి యేలాకలుగుం ।
నిచ్చెలమనీటిఁజల్లిన । విచ్చలవిడి నూరుచుఁడు వినరావేమ॥

శ్లో॥ ఏనయేనశరీరేణ యద్యత్కర్మ కరోతియః ।
తేనతేన శరీరేణ తత్తత్ఫలముపాశ్నుతే ॥

తా॥ ఎవఁడెవఁడు యేదేది మొదట చేయునో దానినే మరల ననుభవించును.

"ఆ॥ అన్నమైనఁదక్రమైనఁదో యంబైన ।
శాకమైనఁదనకు జరుగుకొలఁది ।
నతిథిజనుల కడ్డమాడక యిడరేని ।
లేమ! వారుగలిగి లేనివారు ॥"

ముకుందమాలా,

శ్లో॥ ఆమ్నాయాభ్యసనాన్యరణ్యరుదితంవేదవ్రతాన్యన్వహమ్ ।
మేదశ్ఛేదఫలాని పూర్తవిధయస్సర్వేహుతం భస్మని ।
తీర్థానామవగాహనానిచగజస్నానం వినాయత్పద ।
ద్వన్ద్వామ్భోరుహసంస్మృతిర్విజయతే దేవస్సనారాయణః ॥

తా॥ భగవంతుని పాదపద్మములపై భక్తిలేక యెన్నివేదములు చదివినను, ఎన్నిసత్కర్మలుఁజేసినను, ఎన్నిసత్రములుఁగట్టినను, ఎన్నివనములు వేసినను, ఎన్ని బావులు, కుంటలు, చెఱువులు, కోనేరులు త్రవ్వించినను, ఎన్నితీర్థములలో మునిగినను అన్నియు వ్యర్థము భక్తిఁగలిగిఁజేసిన ఫలముకద్దు.

లోకమును దాని సంపూర్ణతయు నావే, కీర్త. 50-12. భగవదర్పితముగా దానముచేయవలెను. దానమువలన తనకున్న సంపదవృద్ధియగును.

---

27

# నిత్యానిత్య విచారము.

---

మానవుఁడు వివాహమాడి కొల్లగాధనమార్జించి బంధుమిత్రదాసదాసీజన పరివృతుఁడై సర్వవిషయేచ్ఛల ననుభవింపవలయునను కోరికఁగలవాఁడై నిత్యానిత్యమునుఁ గుఱించి కించిత్తైనను విచారము చేయక వాసరములు ద్రోయుట మిగుల పరితాపమగు విషయముగా నున్నది. శరీరాంతము వఱకు ద్రవ్యార్జనమునందును శరీరపోషమునందును వర్తించిన కడన నేమగును; విత్తము గృహమునందును దేహము శ్మశానమునందును దిగవిడిచిపోవును.

శ్లో॥ మృతంశరీర మృత్సృజ్యకాష్ఠలోష్ఠసమంక్షితా।
విముఖాబాంధవాయాంతి ధర్మశ్చమనుగచ్ఛతి॥

తా॥ చచ్చినవాని శరీరమును కట్టెలతోడను మట్టితోడను సమముగా భూమియందువైచి బంధువులందఱును పాఱిపోవుదురు ధర్మమొక్కటి మాత్రము వాని వెంబడించి పోవును.

శ్లో॥ నాముత్రహిసహాయార్థం పితామాతాచతిష్ఠతి।
నపుత్రదారానజ్ఞాతి ధర్మస్తిష్ఠతికేవలః॥

తా॥ తల్లిదండ్రులు భార్యబిడ్డలు జ్ఞాతులు (అన్నదమ్ములు) పరలోకమందు సహాయము చేయరు ధర్మమొక్కటి మాత్రము సహాయముచేయును. కలఁగని మేల్కాన్నగతి బంధువు లందఱు మరణముతో వీడుదురు.

భాగవతము.

మ॥ చెలులుం దల్లులుఁ దండ్రులాత్మజులు సంసేవ్యుల్ పతుల్ చారుని।
నిర్మలగేహంబులటంచుఁ గూర్తురు మహామాయాగుణభ్రాంతులై॥

శ్లో॥ అనిత్యానిశరీరాణివిభవోనైవశాశ్వతః।
నిత్యం సన్నిహితోమృత్యుః కర్తవ్యోధర్మసంగ్రహః॥

తా॥ శరీర మనిత్యము విభవము అశాశ్వతము. మృత్యువు సమీపమున పొంచియుండును గాన ధర్మము చేయుచుండుము. "ఆయుఃకల్లోలలోలం కతిపయదివసస్థాయినీ" ఆయుష్యము తరంగములవలె మిగుల చపలమైనదిఁగాని స్థిరముగా నుండునదిఁగాదు.

శ్లో॥ సంపదస్స్వప్న సంకాశాయౌవనం కుసుమోపమం।
తటిచ్చంచలమాయుశ్చకస్య. జ్ఞానతోభయం॥

తా॥ సంపదలు స్వప్నముతో సమానము. యౌవనము పుష్పమువంటిది ఆయుష్యము మెఱుపులవలె చపలమైనది ఈవిషయము తెలుసుకొన్నవారికి తప్పక భయముండును. "ఎండమావులవంటి భద్రంబులెల్ల సార్థములంచు మర్త్యుండు భోగనిధానదేహములతో విరక్తుఁడుఁగాక" యని భాగవతముననున్నది. భోగంబులు మనోరథజాత మాత్రంబులుఁగాని శాశ్వతంబులుఁగావు.

శ్లో॥ క్షణం చిత్తం క్షణం విత్తం క్షణం జీవితమావయోః॥

చిత్తము క్షణములోనా నారీతుల సంచరించును. ధనము క్షణకాలముననే నశించును జీవితము నిమిషమాత్రముననేఁ గడతేఱును ఐహిక సంబంధమైన సర్వమున శాశ్వతము. మనవెంట నెవరునురారు. మరణముతో శరీరసంబంధమైన సమస్తమును తీఱిపోవును తానుఁ జేచేతులానరించిన పుణ్యపాపములు మాత్రము వెంట నంటును. "అవశ్యమను భోక్తవ్యంకృతం కర్మశుభాశుభం" అనురీతి తానుఁజేసిన మంచి చెడుగుల ఫలితమువనుభవింపకతీరదు.

శంకరాచార్యులు.

శ్లో॥ యావత్పవనోనివసతిదేహే। తావత్పృచ్ఛతికుశలంగేహే।
గతవతివాయౌ దేహాపాయే। భార్యాబిభ్యతితస్మిన్ కాయే॥

ఎంతకాలము దేహమున వూపిరియుండునో అంతకాలమే కుశలప్రశ్న చేయుటయు ఊపిరిపోయిన (చనిపోయిన) వెంటనే బహిఃప్రాణమైన భార్య సహితము దగ్గఱవుండుటకు భయపడును.

గాలిలోపలి దీపము యీ మట్టికాయంబు నేవేళనో కీలులూడిన బొమ్మయును బడినట్లు నేలబడుదేవదేవ,

జాతస్యమరణన్ ధ్రువమ్, పుట్టినవాఁడు చచ్చితీరవలెను.

"కాలము డాసిన నేలన్ గూలకపోవశమె యెట్టిగుణవంతులకున్"

తే। నమ్మరాదయ్య యిదిమాయ నాటకంబు।
జీవునిప్రయాణకాలంబు సిద్ధమైన।
నిలుచునా దేహమింకొక్క నిమిషమైన।
దన్నువిడిపింప వచ్చెడి ధన్యుఁడేఁడీ॥

గాన జాగ్రతపడి యుండుఁడు.

భారతము అరణ్యపర్వము.

చ॥ ధనములు సాలఁగల్గి సతతంబును నింద్రియవాంఛ సల్పుచున్ ।
మనమున నెన్నఁడున్ సుకృతమార్గము పొంతనుఁబోక లోభమో ।
హానిహత బుద్ధులై తిరుగునట్టి జనుల్ పరలోక సౌఖ్యముల్ఁ ।
గనుట నేర రిక్కడి సుఖంబులు మేలయి తోఁచువారికిన్ ॥

ఇందుకు ప్రభువైన యేసు "ఒకఁడు లోకమంతయు సంపాదించుకొని తన ఆత్మను పోగొట్టుకొంటే ఆతనికి ఏమిలాభము. ఆత్మకు ప్రతిగా నేమియివ్వగలఁడు" అని బోధించెను. అంతకంతకు ఆయుష్యము తఱుగుచున్నది జన్మమాదిగ మృత్యువు వెనుఁదగిలియున్నదిఁగాన ఎల్లిఁజేసెదమని ఊరకుండుట తగదు మృత్యువు మన కొఱకు నిదానించి యుండదు "భూతజీవిత మత్యల్పం" మన కట్టెదుటనే మన వారెందఱో కలఁగాంచి మేల్కొన్నగతి దేహయాత్రచాలించి ఉత్తరలోకమునకు వెళ్ళుచున్నారు "ఎందుఱెందఱు దొరలు ఏకచక్రముతోను యిలను ఏలినవారెల్ల యేమైరిమనస" రాజు మొదలు సేవకుని వరకుఁగల మానవులందఱు మరణమునకు లోఁబడినవారే తాననుభవించుటకు వీలులేకపోతే ఎన్నిసౌఖ్యములుండిన నేమి లాభము, చేసుకొన్నవానికి చేసుకొన్నంత మహాదేవయను సామెత రిత్తఁబోవునా కాలము అతిశీఘ్రముగా పరుగిడుచున్నది. సమయము మించిన తర్వాత ఎంతవగచినను ప్రయోజనములేదు. లోకమంతయు నష్టగించినను క్షణకాలమైన నొకని నిలువరింపఁజాలరు. దేహము తోడనే మృత్యువు బుట్టియున్నది.

చ॥ తెలివిని మర్త్యుఁడెప్పుడును దేహపటుత్వము పోకమున్నె వ్యా ।
ధులు చనుదేకమున్నె జరదొట్టి మతిభ్రమరాకమున్నె దాం ।
గల కణుమాత్రమున్ వశముగాక నిరంతర సౌఖ్యమిచ్చి యి ।
మ్ముల వెలయించు పుణ్యధనమున్ గడియింపఁగఁజూడఁగావలెన్ ॥

"రేపగు రేపగుననుచును ఆఁపకు మెన్నఁడు రేపును రాగల ఇక్కట్లెన్నో"

హాయా బ్రతుకునమ్మి సుఖసాయమేమొ యెఱుగవు పాయరాని సంసార బద్ధుఁడవై మఱచేవు కోయలేక కర్మబంధము కోలివతానే తిరిగేవు ఆయువెళ్ళిపోతే దేహమువట్టికట్టెని చూడవు॥ కాయా॥

పుఱికియొడలె నిజమానిముందుఁగానక మురిసెవు నరము ఎముకలు కసరు తిత్తులుకలసి యున్నదిఁగానవు తొమ్మిది ద్వారాల కొంపతొందరెంతోఁజేయును వంచకులకుఁ దెలియరాదు ఒక్కఁడే దేవుండురా॥ కాయా॥

జీవితామృతమును చిమ్మబోకయ్యా ।
మంజుల రోచిస్సు మధుర రూపంబు ।
ఉండబో వెల్లప్పు డుండబోనయ్యా ।
కోమలోజ్వల మైన కుసుమరాజంబు ।
మండు టెండలలోన మాడిపోకున్నే ? ।
ప్రకృతి విషయ జీవనము నిష్ఫలము సుమ్మా ! ॥

సర్వేంద్రియములును మనస్సును ఈశ్వరతత్వావబోధకొఱకు వినియోగించవలెను. సర్వశాస్త్రములు చదివిన బుద్ధికౌశల్య పాండిత్యమంతయు ఆత్మజ్ఞానమునకు సాధనముగా నుండవలెను.

శ్లో॥ కోటయో బ్రహ్మణాంయాతాః గతాస్సర్గపరంపరాః ।
ప్రయాతాః పాంసువద్భూపాః కాధృతిర్మమజీవితే ॥

జీవన్ముక్తి ప్రకాశిక 2 ప్రకరణము.

తా॥ అనేకలక్షల యుగములు జీవించు బ్రహ్మలు ఇంతవఱకు అనేకకోట్లు నశించిపోయినారు అనేకకోట్ల సంవత్సరములు స్థిరముగానుండు బ్రహ్మాండములు అనంతములు నశించిపోయినవి. మఱియు పేరువాసిగాంచిన అనేకరాజులు దుమ్మువలె యెగిరిపోయినారు ఈలాగున నున్నదిగాన నాజీవితమెంతమాత్రము ఎంతకాలము నిలుచును దీనిని నేనెందులకు నమ్మవలెను అని విచారించవలెను.

శ్లో॥ ఏషాం నిమేషణోన్మేషౌ జగతాంప్రళయోదయౌ ।
తాదృశాః పురుషానష్టాః మాదృశాం గణనైవకా ॥

జీవన్ముక్తి ప్రకాశిక 2 ప్రకరణము.

తా॥ ఏ మహాపురుషులు కనురెప్పమూసినమాత్రానదే ప్రపంచమంతయు నశించునో కనురెప్పను తెరచినమాత్రాననే ప్రపంచమంతయుం బుట్టుచుండునో అటువంటి మహాపురుషులెందరో నశించిపోయిరి ఇకను మావంటి క్షుద్రజనులను గూర్చి ఏమిచెప్పగలము.

జనులారా! మీ ప్రభువునకు భయపడుడు తండ్రి కొడుకునకుగాని కొడుకు తండ్రికిగాని యడ్డుపడజాలని యాదినమునుదలంచి గడగడవడంకుము అవును దేవుని ప్రతిజ్ఞసత్యముకావున ప్రస్తుతజీవనమునుజూచి మోసపోకుఁడు దేవునిగూర్చి మోసగాని మోసములో పడిపోకుము నేనేదేవుఁడనని అహంకరించకుము ఆత్మతనకు

మయునాఁడేమి కలుగనున్నదోకూడా తెలిసికొనఁజాలదు ఆయాత్మ యేదేశములో తాను చావవలసియున్నదోకూడా తెలిసికొనఁజాలదు. దేవుఁడు జ్ఞాని అతనికి తెలియని దేదియులేదు. 31 సుర 4, 3, 4.

యావత్పవనో వినసతిదేహే తావత్పృచ్ఛతికుశలంగేహే।
గలితవతివాయౌ దేహాపాయే భార్యాభి భ్యతితస్మిన్కాయే॥

తా॥ ఎంతకాలము దేహమున మాపిరియుండునో నంతకాలమే కుశలప్రశ్న లడుగుటయు ఊపిరిపోయిన వెంటనే అర్ధాంగియైన భార్యసహితము పీనుగును చూచి భయపడుచున్నది.

ఈ శ్లోకాభిప్రాయమునుఁబట్టియే దేహాభిమానప్రియత్వములు నిలువరమైనవి కావని తేలుచున్నది, మనయనుభవము నాలాగేయున్నది.

ఎవ్వరును తమ స్థితిగతులను గురించి ఆయాసపడకూడదు. దేవుఁడు నొకని లక్ష్యించినపుడు వాఁడు హెచ్చింపఁబడేకాలము సమీపించినదని తలంచి దేవునిచేతి క్రింద అణగియుండి దేవునియొక్క సమయోచిత కాలము నిమిత్తము కనిపెట్టుకొని యుండవలెను. ఎందు కనగా ఆయా కాలములలో మనల నెట్లెట్లు నడిపించ తలయునో ఆదిదైవరహస్యము నొక క్షణములో నేదిచేయుట కైనను నాయనకు సాధ్యమే?

నిర్దోషులను దోషులుగా తీర్చిశ్రమ లనుభవింపఁజేయుట ఈ లోకములో సాధారణముగా జరుగుచున్నది సర్వేశ్వరుఁ డొకఁడే నితరులచేత వంచింపఁబడని న్యాయాధిపతి నరుల అంతర్యములన్నియు బయలుపడే కడవరి దినము వరకు యివన్నియు దాచబడియుండును. యెంత అల్పకార్యమైనను దేవుఁడు బయలుపరచును వాటినన్నిటికి మనుజుఁడు జవాబివ్వవలసిన కాలము వచ్చును.

"శోకమ్ము మానదు దేహమీ విధమునన్ పోషించి రక్షించినన్"

అశాశ్వతమైన యీలోకపు శ్రమలకుదిగులొందకూడదు ఎడతెగక ప్రార్థించుడి అని పౌలు చెప్పుచున్నాడు.

యేయాత్మమైనను దేహమును విడిచిపెట్టవలసిన కాలమువచ్చినపుడు దేవుడు వ్యవధినీయడు. 63, సుర 2; 11.

భూమిపై గలదంతయు నశించునుకాని నీప్రభువుముఖము తేజవంతమై మహిమయు తేజస్సునుగలిగి ప్రకాశించుచుండును 55 సుర 2; 21.

"ఏ సంస్వభావేపిసమలో కస్య కశ్చిత్ నద్యాః ప్రతిస్రోతః ప్రవర్తనమవ ధీరః ప్రత్యగాత్మానం స్వంస్వభావమైక్షత్"

శంకరాచార్యులు.

తా॥ ప్రపంచ సంసారము దెసచూచుచుండువాఁడు తన దృష్టిని నమృతత్వమునుఁ జెందించు నాత్మజ్ఞాన ప్రాప్తి దెసఁద్రిప్పవలెను.

దేహేంద్రియాది విషయసుఖములలో నెంతయాసక్తుఁడగుచున్నాఁడో వాఁడు లోకములో నంతబద్ధుఁడగుటయేగాక దైవమార్గదూరుఁడగుచున్నాఁడు. దేహేంద్రియాది సుఖవాంఛలలో నెంత విముఖుఁడగుచున్నాఁడో నంతవిముక్తుఁడగుటయేగాక దైవసన్నిధుఁడగుచున్నాఁడు. అటులని భార్యాబిడ్డలను వదలి సోమరియై కాయకష్టముచేయక పనిపాటులువిడిచి తనజీవనమే తనకునుపరులకును నతిభారముగా పరిణమింపఁ జేసికొనకూడదుగాని భగవంతునికంటె దేనినిగాని యెక్కువగా ప్రేమించకూడదు, సర్వకాల సర్వావస్థలయందు మనకు తోడునీడయై యుండువాఁడు దేవుఁడేగనుక నాయనను సంపూర్ణముగా ప్రేమించవలెను. మరణము సంభవించినపుడు జననీజనకులు అన్నదమ్ములు భార్యాపుత్రులు బంధుమిత్రాదు లెవరును తోడు పడరు ఆకాలమునకు సహాయుఁడై యుండువాఁడు భగవంతుఁడుమాత్రమే.

తర్వాత మానవసేవకై తనసామార్థ్యమంతయు వినియోగించవలెను.

నీవు నేలకుతిరిగి చేరుపర్యంతము నీ ముఖము చెమటకార్చి యాహారము తిందువు. ఆది 3; 19 ఎవఁడైనను పనిచేయనొల్లని యెడలవాఁడు భోజనముచేయకూడదని మీకాజ్ఞాపించితిమి. II థెస్స 3; 10 మీసొంతకార్యములను జరుపుకొనుటయందును మీచేతులతో పనిచేయుటయందును ఆసక్తిఁగలిగి యుండవలెను. I థెస్స 4; 11 రాత్రివచ్చుచున్నది అప్పుడెవఁడును పనిచేయలేఁడు. యోహా 9:4 ఈ లోకమే స్థిరమైనదని అజాగ్రత్తగానుండి దేవునివిశ్వసించక కాలమును వ్యర్థపుచ్చకూడదు శాశ్వతుఁడైన దేవుఁడు నీకునివాసస్థలము. ద్వితీ 33; 21 అని వ్రాయబడిన ప్రకారము దైవసాన్నిధ్యమే మనకు ముఖ్యజీవనము దేనిగూర్చియు చింతపడకుడిగాని ప్రతివిషయములోను ప్రార్థన విజ్ఞాపనములచేత కృతజ్ఞతా పూర్వకముగా మీవిన్నపములు దేవునికి తెలియఁజేయుడి ఫిలి 4: 6 తర్వాత సర్వేశ్వరుఁడే మనకు సమస్తవిజ్ఞానము దయచేయును అప్పుడు సమస్తజ్ఞానమునకు మించిన దేవుని శాంతి మీహృదయములకును మీతలంపులకును కావలియుండును. ఫిలి 4; 7 అప్పుడు వేషధారులైన మాయాగురువుల నమ్మవలసినదిలేదు ప్రభురక్షకుఁడు తానే

ఉపదేశించును. నీకు ఉపదేశము చేసెదను, నీవు నడువవలసిన మార్గము నీకు బోధించెదను నీమీదదృష్టియుంచి నీకు ఆలోచన చెప్పెదను. కీర్త 32; 8.

ఆత్మయనఁబడుతాను ఈదేహయాత్ర ముగిసినను నిర్మ్మలముగాక సజీవాకారమును ధరించి వేరొండు లోకమందుఁజేరి ఇహమందు పాంచ భౌతిక శరీరముతో తానొనర్చిన కార్యఫలము ననుభవించుచు ఎన్ని కల్పాంతము లైనను జీవించి యుండును. అట్టి ఆత్మను (తనను) ఉద్ధరించుకొనుట ప్రాముఖ్యమైన తనప్రథమ కర్తవ్యము మనుష్యుడేమి విత్తునో అపంట నే కోయును. గల 6:7.

ప్రత్యాత్మయు తానుజేసిన పనులకు తానే బాధ్యత వహించి యున్నది. 74. సుర. 2: 38 దేవుని యౌన్నత్యమునకు భయపడి తనయాత్మను మోహమార్గము నుండి త్రిప్పుకొను వానికి నిశ్చయముగా సౌఖ్యభూమియే వాసస్థానము కాగలదు. 79. సుర. 2, 4, 41.

ఆదినమున మనుష్యుఁడు సోదరులు మాతాపితలు భార్యాపుత్రులు అందఱిని వదలి వెళ్లవలెను, 30. సుర. 1, 36, 37.

ప్రభువు నామమును మరువక సంకీర్తనము సేయువాఁడు సుఖియగును' భవిష్యద్దేహ మింతకంటె మంచిదియు శాశ్వతము నైనను ప్రస్తుత దేహము నే కోరుచున్నారు. 81. సుర. 15-17.

గీ॥ దేహమస్థిరమని తాము తెలిసియుండి,
మంచిగతి జూచుకోలేరు మాయదగిలి,
జీవులజ్ఞానమేమని చెప్పవచ్చు,
నవ్యతరభోగి శ్రీసదా నందయోగి ॥

జీవుడు దేహమునందున్నంత వఱకే దాని చక్కదనము అగల చైతన్య ప్రకాశమే లేదు.

శ్లో॥ ఆత్మైవాస్య జ్యోతిర్భవతి ఆత్మనైవాయం జ్యోతిషా।
ఆస్తేపల్యయతే కర్మకురుతే విపల్యేతీతి॥

తా॥ ఆత్మ ప్రకాశముననే సర్వేంద్రియ చేష్టలు జరుగుచున్నవి ఆ యాత్మ మన అంతర్హృదయమందున్నది.

సీ॥ పాంచభౌతికమైన భవనంబు దేహంబు,
పురుషుండు దీనిలోబూర్వకర్మ।
వశమున నొకవేళ వర్తించుదీపించుఁ,
దటియైన నొకవేళ దలగిపోవు।

చెడ నేని దేహంబు చెడుగాని పురుషుఁడు,
చెడఁడాతనికి నింతసేటులేదు।
పురుషునికిని దేహపుంజంబునకు వేఱు,
గానియేకత్వంబు గానరాదు ॥

ఆ॥ దారువులవెలుఁగు దహనుని కైవడిఁ।
గాయములఁ జరించు గాలిభంగి।
నాశలీనమైన నభముచాట్పునవేఱు।
తెలియవలయు దేహిదేహములకు ॥

శ్లో॥ శరీరమధ్యాత్మసుబోధసాధనం విచింత్యత్వార్థసుబోధమాచరేత్ ॥

భారతాశ్చర్యపర్వము 32 అధ్యాయము.

తా॥ శరీరము ఆత్మ విచారము చేయుటకు తగిన సాధనమని యాలోచించి వేదాంతార్థ విచారమును శరీరముండగానే చేయవలయును.

సమానేవృక్షే పురుషో నిమగ్నో అనీశయాశోచతిముహ్యమానః।
జుష్టంపశ్యత్యన్య మీశమస్యమహిమానమితివీతశోకః ॥
ముండకోపనిషత్.

తా॥ ఒకటే వృక్షమును (దేహమనే వృక్షమును) ఆశ్రయించి యుండు జీవపరమాత్మలను రెండు పక్షులలో జీవుడనుపక్షి సంసారసాగర నిమగ్నుఁడై దీనభావముతో మోహమునుఁ జెంది శోకించుచుండును. అయితే ఎప్పుడు పూజ్యుఁడును నీశ్వరుఁడు మహిమగలవాఁడునగు మఱియొక పక్షిని (పరమాత్మను) జూచి సేవించఁగల్గునో అప్పుడే శోకరహితుఁడగును. ఇదియే వేదాంతసారము.

ఆత్మానంరథినం విద్ధిశరీరం రథమేవతు।
బుద్ధింతుసారథిం విద్ధిమనః ప్రగ్రహమేవచ।
ఇంద్రియాణి హయానాహుః విషయాంస్తేషుగోచరాన్।
ఆత్మేంద్రియమనోయుక్తం భోక్తేత్యాహుః మనీషిణః ॥
కఠోపనిషత్తు. 3, 3, 4.

తా॥ ఆత్మరథికుఁడు, శరీరము రథము, బుద్ధిసారథి మనస్సు కళ్ళెపుపగ్గము ఇంద్రియములు గుఱ్ఱములు, విషయములు వాని సంచారప్రదేశములు. ఇట్లు ఆత్మ దేహము ఇంద్రియములు మనస్సుతోఁగూడి భోగించుచుండును.

ఏది ఆత్మ? "యేనవా రూపం పశ్యతి. యేనవా శబ్దంశృణోతి, యేనవా గంధానా జిఘ్రతి, యేనవా వాచంవ్యాకరోతి, యేనవా స్వాదు చాస్వాదుచ విజానాతి." "దేని ద్వారమున లోకులు రూపమును దర్శింతురో, దేనిద్వారమున శబ్దమును విందురో, దేనిద్వారమున గంధము నాఘ్రాణింతురో, దేని ద్వారమున వాక్యముల నుచ్చరింతురో, దేనిద్వారమున రుచిని. అరుచినిగ్ర[illegible]ంతురో, అదే 'ఆత్మ'—(ఐతరేయ-3 అధ్యా-1 వాక్య.)

అత్రాయంపురుషస్స్వయంజ్యోతిర్భవతి,
ఈ పురుషుఁడు స్వయముగా ప్రకాశించువాఁడైయున్నాఁడు.
ఆత్మాశుద్ధోఽక్షరశ్శాంతో ప్రకృతేః పరః,
ఆత్మశుద్ధుఁడు నాశములేనివాఁడు, శాంతుఁడు, ప్రకృతి కంటెభిన్నుఁడు.
ఉత్క్రాన్తిగత్యాతీనామే,
ఆత్మపైకి బయలుఁదేర పెళ్లుటఁ గలదు.
తేనప్రద్యోతేనైష ఆత్మా నిష్క్రామతి చక్షుషోవా మూర్ధ్నోవా,

(శరీరమును విడుచునపుడు) ఆత్మ స్వప్రకాశముచే నేత్రము నుండి యైనను శరీరము నుండియైనను బయలుదేరుచున్నది.

తే॥ ఏదిపురికొల్పుచున్నంత నీ శరీర।
మును సమస్తేంద్రియంబులు మనసు బుద్ధి।
ప్రేరితంబుల పోలికధృతినొనర్చు।
తమపనుల నెల్ల దాని నే యాత్మయండ్రు వివేకచూడామణి॥

నేను అని చెప్పకొనుచు నీవైయుండు ఆత్మ తనకార్యములకొలది సుఖ దుఃఖము లనుభవించుట తథ్యము.

శ్రు॥ పద్మకోశప్రతీకాశం హృదయంచాప్యధోముఖం।
అథోనిష్ట్యా వితస్త్యాంతు నాభ్యోర్ధ్వ ముపరితిష్ఠతి।
హృదయంత ద్విజానీయాత్ విశ్వస్యా యతనంమహాత్॥

సతతం శిరాభిస్తు లంబత్యాకోశసన్నిభం
తస్యాంతేసుషిరం సూక్ష్మం తస్మిన్ సర్వం ప్రతిష్ఠితం
తస్యమధ్యే మహానగ్నిర్వి శ్వార్చిర్విశ్వతోముఖం
సోగ్రభుగ్వి భజన్తిష్ఠ న్నాహార మజరఃకవి
సంతాపయస్వన్ దేహమాపాదతల మస్తకం

తస్యమధ్యే వహ్నిశిఖా అణీయోర్ధ్వావ్యవస్థిత
నీలతోయ మధ్య స్థావిద్యుల్లేఖేనభాస్వరా
నీవారశూకవత్తన్వీ పీతాభాస్యాదణూపమా
తస్యాఃశిఖాయా మధ్యే జీవాత్మావ్యవస్థిత

తైత్తిరీయోపనిషత్.

హృదయస్య మధ్యేలోహితంమాంసపిండం యస్మిన్
తద్దహరం పుండరీకం కుముదమివానేకధా వికసితం
తస్యమధ్యే సముద్రం సముద్రస్యమధ్యే
కోశస్తస్మిన్ నాడ్యశ్చతి స్రోధవంతి తత్రమార
మేళ్చా పునర్భవేతి తత్రహపుణ్యేనపుణ్యాలోకం
నయతి అరమాపాపేనపాప నిశ్చయా యస్మరతి

సుబాలోపనిషత్తు.

అంగుష్ఠ మాత్రః పురుషోంగుష్ఠంచ సమాశ్రితః

తైత్తిరీయోపనిషత్తు.

పైశ్రుతులతాత్పర్యము మాసంతముతోఁజేరి నరములతోఁగూడి ఎఱుపు తెలుపు వన్నెగల తామరకమలము వలెనుండు మొగ్గయొకటి హృదయమునందు తలక్రిందుగా వ్రేజాడుచుండును అదికంఠమునకు జేనెడుక్రిందను బొడ్డునకు జేనెడు మీదుగానుండును. ఆకమలమధ్యమున ముఖ్యమైన రంధ్రమొకటికలదు. ఆరంధ్రం బునమధ్య నంగుళప్రమాణను ఆకాశముండును ఆయాకాశము వికసించిన తామర కమలమువలె నుండును. ఆమధ్యనందు నాకాశమున సముద్రమువలె జలమునిండి యుండును ఆజలమధ్యమున నాత్మ వడ్లముక్క కొననూదివలెను నల్లనిమేఘ మధ్యంబున మెఱయుచుండెడి మెఱుపుతీఁగవలెను మిగుల సూక్ష్మముగాను దానికి సమానమైనది వేఱొకటి లేనిదిగాను పచ్చరంగు గలదిగాను యున్నది. ఆత్మ జఠ రాగ్నిరుష్ణమును గలుగజేసి భుజించు నాహారమును భస్మము చేయించి కాలిబొటన వ్రేలు మొదలు శిరస్సువఱకు వుష్ణమునుగలుగ జేయుచున్నాఁడు. ఈయాత్మ పుణ్య పాపములు జ్ఞప్తిగలవాఁడు పుణ్యమువలన పుణ్యాలోకమును పాపమువలన పాప లోకమును జేరగలవాఁడు.

ఈ యాత్మయుండు హృదయమే పంచభూతములై యున్నది ఎట్లనగా నెరెడె (మట్టిగుండెకాయ) యేభూమి గుండెకాయయేజలము చేదు (ఆకుపచ్చరలెనుండును) ఇదియే అగ్ని దొమ్మ (నొరదబ్బ) అనగా ఊపిరితిత్తులుగాలి హృదయకమలము (బయలు) ఆకాశము ఈ యైదును జేరినదే పంచభూతముల మధ్యమున ఆత్మ ఎట్లు వసించుచున్నాడనగా.

పుష్పమధ్యేయథాగంధః పయోమధ్యేయథాఘృతం ।
తిలమధ్యేయథాతైలం పాషాణేష్వివకాంచనం ।
హృదిస్థానేస్థితం పద్మం తస్యవక్త్ర మధోముఖం ।
ఊర్ధ్వనాళమధోబిందు తస్యమధ్యేస్థితమాత్మ ॥

తా॥ పుష్పమధ్యమునందు పరిమళమువలెను పాలమధ్యనుండు నెయ్యి వలెను నువ్వులలోనుండు నూనెవలెను రాతిలో లీనమయియుండు బంగారువలెను హృదయస్థానమందు తామరకమలము వంటి కమలము (ముక్కైన గుండె) యున్నది దాని మధ్య జలముండును ఆజలమధ్యంబున ఆత్మ నివసించుచున్నాడు.

మఱికొన్ని ఉపనిషత్తులయందు.

శ్రు॥ కపాలకుహరేమధ్యే చతుర్ద్వారస్యమధ్యమేతదా ।
త్మారాజతేతత్రేయథావ్యోమ్నిదివాకరః ।
కోదండద్వయమధ్యేషు బ్రహ్మరంధ్రేషుశక్తితః ।
స్వాత్మానంపురుషంపశ్యేత్ మనస్తత్రలయంగతం ।
రత్నానిజ్యోత్స్నినాదంతు బిందుమాహేశ్వరంపదం॥

ధ్యానబిందూపనిషత్.

తా॥ బ్రహ్మకపాలమునకు నాలుగు ద్వారములుగలవు దానికి మధ్యనుండు నాకాశమునందు సూర్యుఁడు ప్రకాశించుచుండునట్లు ఆత్మ బ్రహ్మకపాలమునందు ప్రకాశించుచున్నాఁడు. అతఁడు నాద (ప్రాణము) బిందు మనస్సుగూడి మహేశ్వరరూపముగా నున్నాఁడు మఱియు కోదండమువలెనుండు భ్రూమధ్యమునందు ఆత్మ సుషుమ్నానాడితో గూడియున్నాఁడు.

బ్రహ్మరంధ్రేభ్రువోర్మధ్యే హృదయేచిత్రవింహారిం ॥

వాసుదేవోపనిషత్.

ఆత్మ బ్రహ్మరంధ్రమునందును భ్రూమధ్యమునందును హృదయ కమలము నందును నివసించుచున్నాఁడు.

హృదయ కమలమున ఆత్మయుండు జలసంబంధమువలననే జీవులయొక్క నాలుకపై నీరూటపుట్టుచుండును ఆయాత్మశరీరమును విడిచి లేచునపుడు హృదయ కమలమునందుండు జలమింకుటచే నాలుకపై జలములేకపోవును. అట్లు నాలుకపై జలములేక యెంకుచూవచ్చి ఆత్మ కడపటవచ్చు శ్వాసముతోఁగూడ లేచి వెళ్లి పోవును పిమ్మట శ్వాసమాడక నిలిచి శరీరము ప్రేతమైపోవును.

ఆత్మచేత శరీరక్రియలను చంపిన ఎడల జీవించెదరు. రోమా. 8, 13.

ఆత్మానుసారముగా నడచుకొనుడి గల 5, 16.

ఆత్మఫలమేమనగా ప్రేమ సంతోషము సమాధానము దీర్ఘ శాంతము దయాళుత్వము మంచితనము విశ్వాసము సాత్వికము ఆశానిగ్రహము గల 5, 22.

ఆత్మనుబట్టి విత్తువాఁడు ఆత్మనుండి నిత్యజీవ మనుపంటను కోయును.

విశ్రమించుటకును ఆనందించుటకును కోరిన యెడల శరీరబాధల కొన్నింటి ననుభవించక తీరదు క్రీస్తు జీవితమంతయు బాధలతోను పరోపకార సత్యము కొఱకు మరణించుటతోను నిండియున్నది.

శ్లో॥ అస్థిరం జీవనం లోకే అస్థిరం యౌవనం ధనం।
అస్థిరం దారపుత్రాది ధర్మకీర్తి ద్వయం స్థిరమ్॥

తా॥ బ్రతుకు స్థిరమైనదికాదు యౌవనము స్థిరమైనదికాదు భార్యబిడ్డలు స్థిరమైనవారుఁగారు ధర్మము కీర్తి ఇవిరెండు మాత్రము స్థిరముగానుండును.

శ్లో॥ యథాచారీయ థాకారీతథాభవతి।
సాధుకారీ సాధుర్భవతి పాపాకారీ పాపోభవతి।
పుణ్యః పుణ్యేనకర్మణాభవతి పాపఃపాపేన॥

తా॥ ఎవఁడెవఁడెట్లెట్లుచేయునో అట్లే కర్మమునుఁ గట్టుకొనును. మంచి కర్మముఁ జేయువాఁడు మంచిగతి నొందును చెడుకర్మమునుఁ జేయువాఁడు చెడుగతి నొందును పుణ్యకర్మముచే పుణ్యాత్ముఁడును పాపకర్మముచే పాపాత్ముఁడగుచువాఁడు.

శ్లో॥ కర్మణామనసావా చాయన్నిత్యం సేవతేనరః।
తదభ్యాసోహరత్యేషోమాభూత్తే తత్రసంశయః॥

సర్వకాలము మనోవాక్కాయములచేత దేనిని అభ్యసించుచుండునో అదియే సంభవించుచుండును సందేహము లేదు. సదాభగవన్నామ స్మరణయందు కాలముఁ గడుపు చుండవలెను,

భగవద్గీత.

శ్లో॥ యంయంవాపిస్మరన్ భావంత్యజంత్యంతే కళేబరం।
తంతమేవైతి కౌంతేయ సదాతద్భావభావితః॥

తా॥ మనుజులంత్యకాలమందు దేనిని స్మరించుచు శరీరమును విడుచుచున్నారో దానినే పొందుదురు. కొందఱు పాపకార్యములనుండి తొలఁగలేక కాఁబోలు శరీరముతో నొనర్చినవి ఆత్మకెటుల నంటునని చెప్పకొనుచు విచ్చలవిడితిరుగుచున్నారు. అట్టివారు ఈ శ్లోకమును గమనింతురుఁగాక.

యజు. బ్రా. వచనము.

శ్రు॥ యన్మనసా ధ్యాయతి తద్వాచావదతి।
యద్వాచావదతి తత్కర్మణాకరోతి యత్కర్మణా కరోతితదభిసంపద్యతే॥

తా॥ (జీవుఁడు) మనస్సున దేనిని ధ్యానించునో దానిని వాక్కుతో చెప్పను. దేనిని వాక్కుతో చెప్పనో దానిని కర్మతోఁజేయును. దేనిని కర్మతోఁ జేయునో దానిని పొందును. అనగా త్రికరణములలో దేనిచేతఁజేసినను ఫలమొకటియే యని అర్థము.

శ్లో॥ హాతాతహాస్వకాంతేతి క్రందంతేసుదుఃఖితాః।
మండూక ఇవసర్పేణ మృత్యునాగ్రస్యతేజనః॥

ఓ. తండ్రి ఓనాకాంతా యని దుఃఖముచేత అఱచుచు వెక్కి వెక్కి యేడ్చుచుండఁగానే సర్పము కప్పను మ్రింగురీతి మృత్యువుచేత సకల జనమును మ్రింగివేయఁబడును. "బలగమందఱు దుఃఖపడుట మాత్రమెఁగాని యించుక యాయువ్వ నియ్యలేరు" "పోకన్మానదు దేహమీ విధమునన్ పోషించి రక్షించినన్"

శా॥ నీరాగారనివిష్టపాంథులక్రియన్ నిక్కంబు సం।
సారసంచారుల్ వత్తురుకూడి విత్తురుసదా సంగంబు లేదొక్కచో॥

అనగా చలివెందరవద్ద బాటసారులుకూడి వెళ్ళురీతి సంసారులు సహా ఎల్లప్పుడు బంధుమిత్రులలోనుండక ఎడఁబాసిఁ బోవుచుందురు.

గీ॥ వెడఁగుపోఁడవై ఎవ్వరో వెంటవచ్చె।
దరని తలతువా హృదయబాంధవులఁగూడ।
ననుగమింపరు ఒకఁడవే యరుగవలయు।
వలదుచింత నీవెంట నెవ్వరునురారు।
వెనుకముందుగా నందఱువెడలవలయు।
ఈకఠోరశాసనము లంఘింపలేవు।
ఎందఱెందఱువచ్చిరి ఎందుఁజనిరి।
చిత్రమిదియువారి స్మృతిచిహ్నమేది।

ఇందుస్థిరముగా మెలగవాంఛింతువేమొ।
నీవిపుడొడలుచాచిన యిల్లునీది।
కాదుక్షణికమిద్దానిపైఁగాంక్షయేల।
చనుట ఎన్నటికైన నిశ్చయముసుమ్ము॥

శ్లో॥ ఆశ్మశానం నివర్తంతే జ్ఞాతిసంబంధబాంధవాః॥

జ్ఞాతులును సంబంధులును బంధువులును శ్మశానము వఱకును వచ్చి మరలి పోవుదురు,

ఐహికవిషయ సుఖములు జలబుద్బుద ప్రాయములనియు నాముష్మిక సుఖములు శాశ్వతానంద సంజనకములనియుఁ దలంచి నిర్మలమైన భగవద్భక్తిఁగలిగి ఈషణత్రయములనులోనుగాక వర్తించిన పరలోకసౌఖ్యమబ్బును.

శ్లో॥ ఇహైవనరకవ్యాధేశ్చికిత్సాంనకరోతియః।
గత్వానిరౌషధం స్థానంసరుజః కింకరిష్యతి॥

తా॥ నరకమనెడు రోగమునకు చికిత్సనుఁజేసికొనఁదగిన ఈ లోకమునందే తగిన చికిత్సనుఁజేసికొననివాఁడు ఔషధములేని పరలోకమునకుఁబోయి యేమిచేయగలఁడు. మూఢానపశ్యంతి మోక్షద్వార మపావృత్తమ్॥ మోక్షద్వారము తెరువఁబడి యున్నదను విషయము మూఢుఁడు తెలియఁజాలఁడు.

శ్లో॥ అధ్రువేణశరీరేణ ప్రతిక్షణ వినాశినా।
ధ్రువం యేనార్జయే ధర్మం సశోచ్యోమూఢచేతనః॥

తా॥ శాశ్వతముగా నుండక ప్రతిక్షణమందు నశించునట్టి స్వభావముఁగలదైన శరీరముచేత శాశ్వతముగానుండు ధర్మమును యేమానవుఁడు ఆచరింపఁడో అట్టి మూఢుఁడు దుఃఖింప తగినవాఁడు అశాశ్వతమైన దేహేంద్రియాదులచేత నాశనరహితుఁడైన ఆత్మయనఁబడు తన్నుద్ధరించుకొనవలయును.

భగవద్గీత 2, 22,

శ్లో॥ వాసాంసిజీర్ణానియథావిహాయనవాని గృహ్ణాతినరోఽపరాణి।
తథాశరీరాణి విహాయజీర్ణాన్యన్యానిసం యాతినవానిదేహీ॥

తా॥ మనుష్యుఁడు చినిగిపోయిన వస్త్రమును విడిచి క్రొత్త వస్త్రమునుఁ గట్టుకొనునట్లు ఆత్మ జీర్ణమైన శరీరమును విడిచి క్రొత్త శరీరమును ధరించుకొనును. "నహన్యతే హన్యమానే శరీరె" ఈ శరీరము నశించును ఆత్మచావదు. అని కఠోపనిషత్తు.

"చెడ నేని దేహంబు చెడుగాని పురుషుండు చెడఁడాతనికి నింతచేటులేదు" అపురీతి ఎన్నటికిని తానుగానుండు ఆత్మనశించదు. విషయ ప్రమత్తతో దైవచింతన లేక వాసరములుఁగడపు భయంకరస్థితినుండి మేల్కాంచి మనదేహారోగ్యస్థితి నుండి జారకముస్నే శాశ్వతానందము కొఱకెత్నించవలెను. శరీరానంతమున సుకృత దుష్కృతఫలముఁ గుడువకతీరదు. "వీరు నిత్యశిక్షపొందను నీతిమంతులు నిత్యజీవము పొందను పోదురు" మత్త 25 అ, 46 వ. మఱియు యేసునాథుఁడు ధనవంతుని లాజరును గుఱించి చెప్పినకథనుబట్టి చూడ పాపులకు పరలోకమందు కష్టమును మంచివారికి నెమ్మదియుగలదని విస్పష్టమగుచున్నది. లూకా 16 అ. 19 వచనమునుండి 31 వచనము వఱకు చదువునది. "నేను అగ్నిజ్వాలలో యాతన పడుచున్నానని కేకలువేసెను" లూకా 16. 24. "ఇప్పుడైతే వాఁడిక్కడ నెమ్మది పొందుచున్నాఁడు" లూకా 16. 25, "నాతండ్రియింట అనేక నివాస ములుఁగలవు లేనియెడల మీతో చెప్పుదును" యోహా 14. 2. త్రికరణములలో దేనిచేత చేసినను ఆఫలమును జీవుఁడనుభవించవలెను.

ఈలోకములో నిలకడగా నుండునది యొకటియునులేదు. సూర్యోదయమందు నొకనికుండు స్థితి అస్తమానమున నుండదు. "నిన్ననవాబు నేఁడు ఫకీరనుట" జరుగుచునేయున్నది. నిరపరాధులకు కూడా శ్రయలు రావచ్చును గాన ప్రతి దినము దైవాశీర్వాదముకొఱకు వెదకి ప్రార్థించుట ఎంతో ఆవశ్యకము చెడి పోయిన మానవ హృదయమునకు ఇతరుల మంచితనమును నమ్ముటకంటే లేని చెడుగునైన కల్పితముగా నమ్ముట నైజము లోకులందఱు చేయి విడిచినను దేవుఁడు తన్ను నమ్మిన వారిని చేయివిడువడు. విశ్వాసికి యీలోకము చింతలతో నిండిన చెరసాలయు దుఃఖపు లోయయునైయున్నది. దీనిలో నొక్కదినము గడుపుట ఎంతో దుర్లభము అయినను మానవసహాయ మంతాముగిసి పోయినప్పుడు చివరి కష్టములో దుఃఖాంధకారపు రాత్రి ముగిసిన సంతోషపు పగలు ఉదయమగును, ఇక్కడ విశ్వాసముకొఱకు వేదనపొందితే అక్కడ జీవ కిరీటము పొందవచ్చును దిక్కులేనివారికి దేవుఁడేతోడు దేవునిబిడ్డలకు ఆపత్సమయములో దేవుఁడు తప్ప యితరులెవ్వరును సహాయముచేయరు. భగవంతుఁడు దుష్టులయొక్క చెడునడతలో నుండియే తనబిడ్డలకు మేలుఁగలుగఁజేయును, ఆయునదయాను కనిపెట్టుకొనియుండు వారు యెన్నటికిని వృధాగా వెళ్లరు.

గీ॥ ఈశ్వరా దేశమెట్టిదో యెవని కెఱుక।
ఈవిశాలప్రకృతి తత్వ మెవఁడెఱుంగు।

ఏది యెటులగునో చెప్ప నెవ్వఁడోపు।
నే గడియకేమొ యెవ్వ రూహించగలరు॥

దేవునికి పక్షపాతము లేదు. రోమా 2, 6-11 ప్రతివాఁడు తన బరువుతానే భరించుకొనవలెను. గలతి 6, 5.

తే॥ నీవుమితిలేని జ్ఞానివి నీసుబోధ। సాటిలేనిది తలపఁగ శాశ్వతుండ।
నీ ఒనర్చెడు పనులన్ని నీతిగలవి। వానిశోధింప శక్యమె మానవులకు॥

భారతారణ్యపర్వము చతుర్థాశ్వాసము.

చ॥ మనుజులు పుణ్యపాపములు మానక యిందొనరించుచుఁ దుదిం।
దనువుఁదొఱంగి పోవునెడఁదప్పవు, నీడయబోలెఁ గర్మమున్।
వెనుకనయేఁగి, భూరిసుఖవిస్ఫురితియుం బటుదుఃఖ దైన్యమున్।
దనుకఁగఁ జేయు,...................................॥

తా॥ మనుజుఁడు ఈ లోకమందు చేయుపుణ్యపాపకార్యముల ఫలితము దేహమునువిడిచి పోవునపుడు అవితొలగిపోక జీవాత్మునివెంట నీడవలె పరలోకమునకు పోయి అచ్చట సుఖముగాని దుఃఖముగాని గల్గించును.

దీనిని చదువు సోదరా ఉత్తరక్షణము మనదికాదని తలంచి ఆత్మీయ హెచ్చరికపొంది.

శ్లో॥ క్వాసంక్వచ గమిష్యామికశ్చాహం కిమిహాగతః।
కోబంధుర్మమ కస్యాహమిత్యాత్మానం విచింతయేత్॥

తా॥ నేనెవఁడను ఎక్కడనుండి వచ్చితిని ఎక్కడకుఁబోదును, యెవనికి సంబంధించినవాఁడను అని ఆత్మవిచారము చేయవలెను. మరణకాలమందు చింతించి తనను కడతేర్చుకొనుట కానిపనిఁగనుకనే.

ముకుందమాల.

శ్లో॥ ప్రాణప్రయాణ సమయే కఫవాతపిత్తైః।
కంఠావరోధన విధౌస్మరణంకుత స్తే॥

తా॥ ప్రాణము శరీరమును విడిచి పరలోకమునకు ప్రయాణముచేయు సమయములో కఫవాత పిత్తములచే కంఠావరోధనగలుగును అప్పుడు దేవుని స్మరణ ఏలాగుండును. ఇందుకను గుణముగా వేమన.

గీ॥ కష్టము వీరాతి మఱియుఁ గనులు మూతలువడి।
బుద్ధితప్పి చాలబ్రదమి మఱచు।
వేళలందు నిన్ను వెదకుట సాధ్యమా ॥విశ్వ॥

నారాయణ శతకము.

"సమయమైనపుడు మిమ్ముదలచుటకు శక్తిఁగలుగునో గలుఁగదో" నేఁడే యీ క్షణమే "కృత్వాపాపంహి సంతప్త్య" అనురీతి చేసిన పాపములకు పశ్చాత్తాపపడి.

శ్రు॥ అచింత్యశక్తిరయం పరమేశ్వర ఇత్యర్థః॥

తా॥ ఇంతటివాఁడని యోచించుటకు శక్యముఁగాని మహిమఁగల పరమేశ్వరునియందు "మోక్షసాధన సామగ్ర్యామ్ భక్తిరేవగరీయసి" అనురీతి మోక్షసాధనములలో శ్రేష్ఠమైనది భక్తిఁగనుక అట్టి భక్తితో "ధ్యానంపదమీశ్వరస్య విధివత్సంసారవిచ్ఛిత్తయే" సంసార నాశనముకొఱకు అనగా మోక్షముకొఱకు సాధనమైన పరమేశ్వరుని పదము ధ్యానము చేయవలెను. పరబ్రహ్మమును శరణుఁ జొచ్చి ఫలాపేక్ష లేక దానధర్మాది సత్కర్మలు స్వామి కర్పితముగా ఉదార బుద్ధితో, తోడిమానవులయెడ నాచరించుచు యాపరమగురువు తన్ను రక్షింపఁగలఁడను సంపూర్ణవిశ్వాసముతో యాప్రేమపూరితుని పాదారవిందములు హృదయసీమయందుంచి సర్వేశ్వరుని త్రికరణశుద్ధిగా భజించిన జన్మపావనత్వమునొంది జీవన్ముక్తుఁడై ఎన్నటికి చేటులేని శాశ్వతానందపదవిలో మోక్షనగరియందు స్థిరవాసుఁడైయుండును.

గీ॥ సత్యమనఁబడు రతనాల సరిగెఁదాల్చి।
శాంతినానొప్పు చొక్కటంబు సరడుఁబూని।
దయయనందగు పవడంపు దండికఁగొని।
వరలుమనుజుఁడె సౌందర్యవంతుఁడరయ॥

ఈ లోకశ్రమలవలన గలుగు దుఃఖములను పాటించక మెలగవలెను "దుఃఖపడువారు ధన్యులు; వారోదార్చఁబడుదురు, మత్తయి 5 అ. 4 వ" ఆయన వారి కన్నుల ప్రతిబాష్పబిందువును తుడిచివేయును, ప్రకట 21 అ 4 వ. 'పరలోకమహిమ నెదుట ఇప్పటి కాలపుశ్రమలెన్నదగినవికావు' పౌలు. ఐహికము దుఃఖప్రాయమై పోయినను పరలోకమున శాశ్వత విపులానందముగలదు. తథ్యము.



# స్త్రీ పునర్వివాహ విషయము.

---

మనువు అ. 4, 161. శ్లో.

శ్లో॥ యత్కర్మకుర్వతో஽స్యస్యాత్పరితోషోంతరాత్మనః ।
తత్ప్రయత్నేనకుర్వీతవిపరీతంతు వర్జయేత్ ॥

తా॥ అను మను శ్లోకము ప్రకారము మీరేపనినిఁజేసిన మీ అంతరాత్మ సంతోషించునో ఆపనిని జేయుచు మనోసాక్షికి యిష్టముఁగాని పనిని మానుఁడు.

శ్లో॥ కర్తాకారయితాచైవ ప్రేరకశ్చానుమోదకః ।
సుకృతేదుష్కృతేచైవ చత్వారస్సమభాగినః ॥

ఏకార్యమునందుఁగాని చేసినవారికిని చేయించిన వారికిని ప్రేరేపించిన వారికిని ఆమోదించినవారికిని అందుల ఫలముగలదు. స్త్రీ పునర్వివాహమునకు శ్రుతి ప్రమాణము. యజుర్వేదతైత్తిరీయారణ్యకములోని యాఱవ ప్రపాఠమునందలి 14 అను వాకములో మృతుఁడైన యాహితాగ్ని బ్రాహ్మణుని భార్యనుగూర్చి.

శ్రు॥ ఉదీర్ష్వనార్యభిజీవలోకం గతాసుమేతముపశేష ఏహి ।
హస్తగ్రాభస్యదిధిషోస్త్వమేతత్పత్యుర్జనిత్వమభిసంబభూథ ॥

తా॥ ఓనారీ చచ్చియున్న నీ పెనిమిటివద్ద పడియున్నావు బ్రతికియున్నవారిని చూచిలేచిరా, పాణిగ్రాహకుఁడును ఐతంతువును వివాహమాడ నిచ్ఛగలవాఁడును నగుభర్తకు భార్యవుకమ్ము.

పరాశరస్మృతి నాల్గవ అధ్యాయమున మనువు నారదుఁడు మొదలగువారును.

శ్లో॥ నష్టేమృతేప్రవజితేక్లీబేచ పతితేపతౌ ।
పంచస్వాపత్సునారీణాం పతిరన్యోవిధీయతే ॥

తా॥ పతిదేశాంతరగమనముచేత నష్టమైనపుడును, మృతుఁడైనపుడును, సన్యసించినపుడును, నపుంసకుఁడైనపుడును, కులభ్రష్టుఁడైనపుడును ఈ అయిదాపదలయందును స్త్రీ మఱియొకనిని వివాహమాడవచ్చును అని చెప్పినారు.

నారదస్మృతి.

శ్లో॥ ఉద్వాహితాపియాకన్యానచేత్సంప్రాప్తమైథునా ।
పునస్సంస్కారమర్హేతయథాకన్యాతథైవసా ॥

తా॥ కన్యవివాహితురాలైనను పురుష సంయోగము పొందనిదైన పక్షమున కన్యకవలెనే పునర్వివాహమున కామె యర్హురాలగును.

వసిష్ఠుడు.

శ్లో॥ పాణిగ్రాహేమృతే బాలా కేవలం మంత్రసంస్కృతా।
సాచేదక్షతయోనిస్స్యాత్ పునస్సంస్కారమర్హతి॥

తా॥ పాణిగ్రహణముచేసినవాఁడు మృతుఁడైనప్పుడు కేవలమంత్ర సంస్కృతురాలయిన కన్య అక్షతయోనియైన యెడల పునర్వివాహమున కర్హురాలగును, అక్షతయోని యనగా పురుష సంభోగము పొందనిది. "వైవాహికోవిధిః స్త్రీణాం సంస్కారోవైదికస్స్మృతః" మనువాక్యమునుఁబట్టి స్త్రీలకు వివాహము సంస్కారమనఁబడును.

భారతము భీష్మపర్వము.

శ్లో॥ అర్జునస్యాత్మజః శ్రీమాన్నిరావాన్నామ వీర్యవాన్।
సుతాయాం నాగరాజస్యజాతః పార్థేనధీమతా।
ఐరావతేనసాదత్తాహ్యనపత్యామహాత్మనా।
పత్యౌహతేసుపర్ణేనకృపణా దీనచేతనా॥
భార్యార్థంతాంచజగ్రాహపార్థః కామవశానుగాం,

*　　*　　*　　*　　*

అజానన్నర్జునశ్చాపినిహతం పుత్రమౌరసం।
జఘానసమరేశూరాన్ రాజ్ఞస్తాన్ భీష్మరక్షిణః॥

తా॥ స్త్రీ పునర్వివాహము శాస్త్రసమ్మతమని తెలుపుట మాత్రమేఁగాక సుపర్ణునిచేత భర్తచంపఁబడిన తర్వాత ఉలూపిని మరల నర్జునుఁడు వివాహము చేసికొనుటను విధవరాలైన ఉలూపిని తండ్రియైన నాగరాజేమరల వివాహమునకు దానముచేయుటయు పునర్వివాహమాడిన యువతికిఁబుట్టిన పుత్రుఁడు ఔరసుఁడే యగుటను తెలుపుచున్నది. మఱియు భారతమునందే నలుఁడు నష్టుఁడైనప్పుడు దమయంతి ద్వితీయ స్వయంవరమునకు దేశదేశములకు వర్తమానముపంపగా రాజులందఱు సమ్మతిగల మనస్సుతో రాజర్షియైన ఋతుపర్ణుఁడు సహా వెంటనే బయలుఁదేరివచ్చుటయు స్త్రీ ద్వితీయ వివాహమునకు మనఃస్ఫూర్తిగా నొప్పినట్టుఁగానే స్పష్టముఁగాకనఁబడుచున్నది.

పద్మపురాణము చిత్రోపాఖ్యానమునందు సప్తమోధ్యాయమున కాశీరాజైన దివోదాసుఁడు తన కుమార్తెకు భర్తపోయినప్పుఁడెల్లను మరల మరల వివాహము చేయుచువచ్చెనని చెప్పఁబడియున్నది.

కన్యాదాత:— పునర్వివాహమునందు కన్యకను పునర్దానము చేయవలసిన వారు తండ్రి మొదలైనవారనుట కాక్షేపణలేదు. పూర్వము కాశీరాజుదివో దాసుఁడు తన కొమార్తె దివ్యాదేవిని, ఐరావతుఁడు తన కూతుర్తె యులూపిని, విధవలైన తర్వాత తండ్రులే కన్యాదానము (పునర్దానము) చేసియున్నారు గాన వారి దృష్టాంతములేమాదిరి చూపుచున్నవి.

ముండనము. పరాశరుఁడు తన స్మృతి 9 అ.

శ్లో॥ సర్వాన్ కేశాన్ సముద్ధృత్య ఛేదయేదంగుళద్వయమ్।
ఏవం నారీకుమారీణాం శిరసో ముండనం స్మృతమ్॥

తా॥ స్త్రీలకుఁగాని బాలికలకుఁగాని ఎక్కడనైనను ముండనము విధించిన పక్షమున వెండ్రుకలన్నిటిని వదలివేసి చివరరెండంగుళములు మాత్రము ఖండింపవలయునని చెప్పఁబడి యున్నదిగాని విధవాస్త్రీకి తలబోడిచేయవలెనని ఎచ్చటను లేదు. పద్మపురాణము మాఘమహాత్మ్యము 38 అధ్యాయము.

శ్లో॥ బ్రహ్మవిష్ణుగిరీశాదయస్సురా మేపి సిద్ధమునయః పురాతనాః।
తేపి యోగబలినోపి మోహితా లీలయా తదబలా చిరదుద్భుతమ్॥

తా॥ పూర్వకాలపువారైన బ్రహ్మ విష్ణు శివుఁడు ఇతర దేవతలు యోగసిద్ధి పొందిన మునులు మున్నగువారు యోగబలముఁగలవారై యుండియు స్త్రీలవిలాస చేష్టలచే మోహింపఁబడినవారైరి. అది యాశ్చర్యము.

భర్తృహరి.

శ్లో॥ విశ్వామిత్రపరాశరప్రభృతయో వాతాంబు పర్ణాశనా।
స్తేపి స్త్రీముఖపంకజం సులలితం దృష్ట్వైవ మోహంగతాః।
శాల్యాన్నం సఘృతం పయోదధియుతం భుంజంతియే మానవాః।
తేషామింద్రియ నిగ్రహోయది భవేద్వింధ్యస్తరేత్సాగరే॥

తా॥ విశ్వామిత్ర పరాశరాదులైన వాతాంబు పర్ణాశనులు సహితము సుందరమైన స్త్రీ ముఖపద్మమునుఁజూచి మోహపరవశులగుచుండఁగా నెయ్యిపాలు

పెరుగు మొదలైన వానితో వరియున్నమునుదిను సాధారణ మనుష్యులకే ఇంద్రియ నిగ్రహముఁ గలుగుపక్షమున వింధ్యపర్వతము సముద్రమునఁ దేలవలసినదేయని చెప్పుచున్నాఁడు.

మనువు.

శ్లో॥ మాత్రాస్వస్రాదుహిత్రావానవివిక్తాసనోభవేత్ ।
బలవానింద్రియ గ్రామోవిద్వాంసమపికర్షతి॥

తా॥ బలవంతమైన యింద్రియ వర్గము విద్వాంసులను సహితమీడ్చును గనుక తల్లితోనైనను తోడఁబుట్టిన పడుచుతోనైనను కుమార్తెతోనైనను రహస్యముగా కూరుచుండకూడదని విధించియున్నాఁడు, తల్లి మొదలైనవారితో విద్వాంసులే వొంటరిగా కూరచుండఁ గూడదన్నప్పుడు మూఢుల విషయమున చెప్పనక్కరయేలేదు,

సర్వసముఁడైన ఈశ్వరుఁడు స్త్రీపురుష భేదములేక మనుష్యజాతియంతయు నీ లోకములో సాధ్యమైనంత సంపూర్ణ సుఖ మనుభవించుటకే యుద్దేశించియున్నాఁడు. ఇహలోకములో పొందఁదగిన సుఖములలో కామసుఖమొకటి సర్వదయాపరుఁడైన జగదీశ్వరుఁడు పురుషులకువలెనే స్త్రీలకును క్షుత్పిపాసాదుల వలెనే కామమును ప్రసాదించియున్నందున పురుషులుఁగాని స్త్రీలుఁగాని దానిని యుక్తరీతిని శాంతి పొందించుకొని సుఖపడవలయుననియే ఈశ్వర సంకల్పమగుట స్పష్టము, చౌర్యాదులయందు ప్రవేశింపక యుదరపోషణము చేసికొనుట ఎట్లు న్యాయమో వ్యభిచారాదులయందు ప్రవేశింపక కామశాంతి చేసికొనుటయునట్లే న్యాయము. కామశాంతికై ఏర్పడిన న్యాయమార్గము వివాహబంధము. మన మాధర్మమార్గమతిక్రమించి మనవారి నెంత నిర్బంధములలోనుంచినను స్వర్గము వచ్చునన్న యాశచూపి యెన్నిసుబోధలు చేసినను మనుష్యప్రకృతి నడుగక యధర్మమార్గమున వేరొకత్రోవ నడచునుగాని ఎల్లవారికి నింద్రియ నిగ్రహము కలుగనేరదు సమస్తమును తెలిసి సర్వసంగ పరిత్యాగులైన మునులేపైన వ్రాసిన శ్లోకముల రీత్యా కాముని ధాకకు నిలువలేరన్నపుడు ఉప్పును పప్పునుతినుచు సదాసుందర పురుషుల మధ్యతిరుగుచు కామప్రేరితులమధ్య సంచరించుచున్న వెనుకుముందు తెలియని విధవలాయింద్రియ నిగ్రహముచేసి బ్రతుకుట న్యాయమార్గ మరికట్టుటవలన ఏహీనునో తగులుకొని గర్భవతులై కులమున కపకీర్తితెచ్చుచు భ్రూణహత్యలకును శిశుహత్యలకును పాల్పడి తుదకు నిర్బంధములకు తాళలేక వ్యభిచారభర్తతో లేచిపోయి బాహాటముగా కాపురముచేయుట తటస్థించును వర్ణింపబూనినచో లెక్క

లేని అనర్థావమానములు మితిమీరినన్నిగలవు. స్వార్థపరులచే కుకల్పితముగా వ్రాయఁబడిన కొన్ని ప్రతికూల శాస్త్రదృష్టాంతములుండిన నుండవచ్చును. శాస్త్ర విచారమెట్లున్నను బుద్ధిబలముచేతను యుక్తిచేతను దేశకాలావస్థలను బట్టియు అనుభవమునుఁబట్టియు మానుష శారీరధర్మ స్వభావమునుబట్టియు యోచించి చూచిన అందుకు విరుద్ధముగాఁగన్పించు శాస్త్రమును విడనాడుటయే ధర్మము. పూర్వమెన్నడో పుట్టిన ధర్మశాస్త్రములనే నేటివఱకును నాచరించవలయుననుట యక్రమము. కొన్నిశతాబ్దముల క్రిందట ధర్మశాస్త్రములుద్భవమాయెను. ఈ మధ్యకాలమున ప్రపంచమెంతయో మారిపోయినది. ఆనాఁడు తిన్నయన్నమే కట్టిన బట్టయే చేసినవ్యాపారమే ఈనాఁడు నుండవలయుననుట విపరీతము పూర్వకాలపు స్థితిగతులనుబట్టి అప్పటి ప్రభువులయొద్దనుండు ధర్మవేత్తలు అప్పటికాలానుగుణ్యముగా ధర్మశాస్త్రములను రచియించియుందురు స్థితిగతులు సంపూర్ణముగా మారిపోయిన వెనుకఁగూడనవి పనికివచ్చునా? మనప్రభుత్వమువారు చేయు రాజశాసనము లప్పటప్పటికి కాలానుసారముగా మారుటలేదా? జీర్ణమై శిథిలమై కాలము తీరిన పురాతన ధర్మశాస్త్రములన్ని విషయములయందనుష్ఠేయముగా నుండజాలవు. కనుక విధవావివాహములు ధర్మశాస్త్ర సమ్మతములా కావాయను నంశముకంటె దేశకాలవర్తమాన స్థితులనుఁబట్టి యోగ్యములా కావాయను నంశమే ముఖ్యముగా నాలోచించఁ దగియున్నది. వితంతూద్వాహము జరుగనియెడల విధవలకుండు కష్టములు కొందఱు మహనీయులిట్లు నుడువుచున్నారు.

తే॥ దివ్వెలేని దీపస్తంభ మెవ్విధంబొ।
కప్పులేనట్టి సదనంబు కరణియెట్లొ।
అడవి గాచిన వెన్నెలయవుటయెట్లొ।
పతులులేనట్టి మగువల బ్రతుకునట్లు॥

తే॥ శుభములకు మృత్యువట్టులఁ జూచుచుండ।
పాపివిధవని వ్రేలెత్తిచూపుచుండ।
పయనమగువారికెదురై చివాట్లనొంద।
బ్రతుకవలయును భూమికి బరువుఁగాను॥

గీ॥ పనికిమాలిన యీపాడుబ్రతుకుకన్న।
ఆత్మహత్యయె యుత్తమంబంచునెంతు।
ఔర! మాయబాధలనెల్ల నవనిలోనఁ।
తిట్లకొఱకుఁబుట్టించితే దేవదేవ॥

"వైధవ్యసదృశం దుఃఖం స్త్రీణామన్యంనవిద్యతే" స్త్రీలకు విధవత్వమునకు సమానమగు దుఃఖము ఏదియునులేదు.

"అతత శీతలోదకమునందున స్నానము; నెల్లవేళలన్। భూతల్పమందుశయ్య యొక పూటయె భోజనము; మింతెకాక దాసీతన మాత్మవృత్తి; యిటుఁజేసిన వంకల నెన్ను బాంధవుల్; నాతరమా భరింపగ క్షణంబును నీవిధవత్వమీశ్వరా॥

శా॥ సైనుంగట్టి సుఖంబెఱుంగక యుహా సన్యాసినీవృత్తితో।
నీనాడుంగడుపారఁగూడు గనకేనిట్లు దుఃఖంబునన్।
బూనంగా తలిదండ్రులార భళిరే! మోదంబునన్ నాదరిం।
నానాభక్ష్యపదార్థముల్ గుడుచుటల్ న్యాయంబెయోచింపుడీ॥

తే॥ భర్తతోడిదె సౌఖ్యంబు భామినులకు
ధవునితోడిదె పుణ్యంబు తరుణులకును।
మగనితోడిదె లోకంబు మానినులకు।
పతియులేనట్టి జన్మంబు పడతికేల॥

విధవా వివాహములు పెంపొందనందున ఇతర మతములవారికన్న హిందువుల జనసంఖ్య తగ్గుటకుకూడా కారణమగుచున్నది. విధవా వివాహమును గురించి సత్యవేదము " భర్తగల స్త్రీ భర్త బ్రతికియున్నంత వఱకే ధర్మశాస్త్రమువలన అతనికి బద్ధురాలు కాని భర్త చనిపోయినయెడల భర్తవిషయమైన ధర్మశాస్త్రమునుండి ఆమె విడుదల పొందును కాబట్టి భర్త బ్రతికియుండఁగా ఆమె వేరొక పురుషునిఁజేరినయెడల (వేరొకని వివాహమాడిన యెడల) వ్యభిచారిణి యనఁబడునుగాని ఆమె భర్త చనిపోయిన యెడల ధర్మశాస్త్రము నుండి విడుదల పొందెను గనుక వేరొక పురుషుని చేరినను (వివాహమాడినను) వ్యభిచారి కాకపోవును." రోమా 7:23. పురుషునికి భార్యపోయినను కామము తగకుండుటవలన మరల వివాహమాడవలయునని భగవత్స్మృతమైనట్టే స్త్రీకి మగఁడు పోయినను కామము దగకుండుట స్త్రీ మరల వివాహమాడవలయునని భగవదిష్టముగాదా? అగును కానియెడల సర్వశక్తిగల ఈశ్వరుడు కామము తీసివేసియుండును. భగవంతుడు దయచేసిన సుఖమనుభవించకుండా భగవదుద్దేశమునకు వ్యతిరేకముగా పోరాడిన ఎంత ఘోరపాతకమో యోచింపుడు. ఓదీనజనశరణ్యా దుఃఖితుల సోదార్య్య కరుణాకరా జగదీశ్వరా అనాథరక్షకా మాదేశమందలి ఈ ఘోరవర్ణ పిశాచకట్టుబాట్లను తొలగించి విధవా వివాహములు పెంపొంద ననుగ్రహింపుము.

సీ॥ కూతురును బాలవిధవయై కూరుచుండ। తండ్రి రెండవ భార్యతోఁ దనివిదీర
సరసములాడుచుండును సరిగటంచు। కాలవిపరీతమిది గాక కలదె యొండు॥

# రజస్వలా వివాహము

మనువు.

శ్లో॥ త్రీణివర్షాణ్యుదీక్షేత కుమారీ ఋతుమతీసతీ।
ఊర్ధ్వంతు కాలాదేతస్మాత్ విందేత సదృశంపతిమ్॥

అర్థము--బాలిక ఋతుమతియయ్యును మూడుసంవత్సరములు పేక్షించి సదృశుఁడైన పతిని వరియింపవచ్చును.

విష్ణుస్మృతి.

శ్లో॥ ఋతుత్రయముపాస్యైవకన్యాకుర్యాత్స్వయంవరం।

అర్థము--మూడుఋతువు లుపాసించి కన్యస్వయంవరము చేసికొనవచ్చును.

సుశ్రుతమను వైద్యగ్రంథము

శ్లో॥ ఊనషోడశవర్షాయామప్రాప్తః పంచవింశతిమ్।
యద్యాధత్తే పుమాన్గర్భం కుక్షిస్థః సవిపద్యతే।
జాతోవానచిరంజీవే జ్జీవేద్వాదుర్బలేంద్రియః।
తస్మాదత్యంత బాలాయాంగర్భాధానం నకారయేత్॥

అర్థము--25 సం॥ లోపు పురుషుడు 16 సం॥ లోపు బాలికను పొందెనేని శిశువు గర్భములోనైనఁజచ్చును. ఒకవేళ జన్మించినను దీర్ఘకాలము జీవించదు. జీవించినను దుర్బలమై యుండును। కాన పసితనములో గర్భాధానము చేయకూడదు. సరియైన దేహపటుత్వ మేర్పడకముందే పిల్లలను కనుటవలన గిడసబారి యులకరించుకొని పోయిన అరటిచెట్లను వ్రేలెడుగెల దిగినటుల ఎలుకకూనలఁబలె పిల్లలు పుట్టి కాలము రాక ముందే రజస్వలలగుటయు తల్లులు 20 ఏండ్లకుముందే బడుగులై ముసలులగుటయు సంభవించుచున్నది.

గీ॥ వయసుగుణముల దన్మనోభావములను।
సతిపతులెకాంచి గురువులు సమ్మతించి।
చేయు పెండ్లిండ్లు సుఖములఁ జెందు నెపుడు॥

బ్రహ్మచర్యేణకన్యా యువానం విందతేపతిమ్ అథర్వకాం॥11 ప్ర24 అ3 మం18

కన్యా= కుమార్తె. బ్రహ్మచర్యేణ= బ్రహ్మచర్య సేవచే వేదాదిశాస్త్రముల చదివి పూర్ణయౌవనావస్థయందు యువానమ్= పూర్ణయౌవనుఁడైన యుక్తపురుషుని పతిమ్= పతినిగా విందతే= పొందునుగాక.

శ్లో॥ పూర్ణషోడశవర్షా స్త్రీ పూర్ణవింశేనసంగతా।
శుద్ధగర్భాశయే మార్గే రక్తే శుక్రేనిలే హృది॥

వీర్యవంతం సుతే మాతేతతో న్యూనాబ్దయోః పునః
రోగ్యల్పాయు రథవో వాగర్భో భవతినైవవా॥ చరక సంహిత.

తా॥ పదారు సంవత్సరములు నిండిన స్త్రీ ఇరువది సంవత్సరములు నిండిన పురుషునితో కలసినయెడల గర్భాశయమార్గమున రక్తము శుక్రమువాయువు ఇవన్నియు శుద్ధంబై నడచి బలముగల కుమారుడు పుట్టును అట్లుగాక తక్కువ వయస్సుగలవారైనయెడల రోగము అల్పాయువుగల శిశువుగాని బుట్టును

ఓ కరుణాకరా మేము నీవిధుల ననుసరింప బల సహాయముల్ల దయచేయుము

# దైవోపాసన (భక్తి)

శ్లో॥ స్తుతిస్మరణ పూజాభిర్వాఙ్మనః కాయకర్మభిః ।
సునిశ్చలా భవేద్భక్తిః ఏతదీశ్వర పూజనం॥

తా—వాక్కుచేత స్తుతించుట మానసమున స్మరించుట కాయముచేత పూజించుట ఈ మొదలైనవి భక్తిగల ఉపాసనయనబడును. ఇదియే ఈశ్వరపూజ పూజావిధము పుష్పములవిధము విగ్రహారాధన ప్రస్తావనలో తెలుపబడినది.

"స్మరణాత్కీర్తనాద్దేః ప్రాప్నోతిపరమాంగతా" దేవునిస్మరణ కీర్తనవలన పరమగతికి ప్రాప్తముగుచున్నాడు.

"భక్తియులేకను భువిలోముక్తికిఁబోవలయు నంటె మాలంబేది భక్తియె ముక్తికి సాధన."

జ్ఞానమార్గమునఁగాని కర్మమార్గమునఁగాని సాధించలేని సద్గతిభక్తి మార్గమున నే సాధించగలరు.

"ఈయుగమున జ్ఞానియెక్కడ" మనుజుల జ్ఞానము దేవునికి వెఱ్ఱితనము" అని సత్యవేదము ఘోషించుచున్నది, మానవు డే నాటికి పరిజ్ఞానవంతుడు గాలేడు. కొఱతలేని సంపూర్ణ సత్క్రియలు చేయజాలడుఁగాన ‹‹గుణోపకిర్యా తాంయత్నః కిమాటోపైః ప్రయోజనమ్" మంచి క్రియాగుణము కొఱకెత్నించవలెనుఁగాని పటాటోపములతో లాభములేదు.

భాగవత ద్వితీయ స్కంధమున.

మ॥ ఉపవాసవ్రతశౌచశీల మఖసంధ్యోపాసనాగ్నిక్రియా।
జపదానాధ్యయనాది కర్మములనెందుఁ బ్రాప్తిచేకూర ద
చ్చపుభక్తిన్ ....................... ...... ।
........పాపఘ్నుపరేశు---------గొల్వలేకుండినన్॥

తా-- భక్తితో భగవంతుని ధ్యానించని యెడల ఇతర ఆడంబరములతో చేయు ఏకార్యములవలనఁగాని మోక్షము రాదు.

భక్తి సేవగరీయసి" భక్తియే శ్రేష్ఠము.

రామస్తవరాజము.

మ॥ మణిమంత్రౌషధ యంత్ర తంత్ర జపహోమ ద్రవ్యయోగంబులన్।
దణిమాదుల్ గగనాది గానమహిమాద్యంతంబులౌ సిద్ధులన్।
గుణసామ్యంబు మహాదులన్నియును ముక్తుల్ వీటిగా గోరు----
-----------------------------------------------

తా= ముముక్షువులు మంత్రములు, తంత్రములు, జపములు, హోమములు, యోగము అణిమాదులు, సిద్ధులు, గగనపరిమాణములు మొదలైన వేవియుఁ గైకొనరు. 'భక్తి యోగాన్ముక్తి' అనురీతి భక్తియోగము ముక్తికి మూలము,

భాగవత సపమ స్కంధమున.

క॥ చిక్కఁడు వ్రతములఁ గ్రతువులఁ।
జిక్కఁడు దానముల శౌచశీలతపములన్।
జిక్కఁడు యుక్తిని భక్తిని।
జిక్కనక్రియ నచ్యుతుండు సిద్ధము సుండీ॥

మనుజుఁడు చేయు ఏకార్యమువల్లను దేవుఁడు చిక్కఁడు భక్తియందు మాత్రము దేవుఁడు తనకు దొరకును.

మానసబోధ శతకమునందు.

ఉ॥ ఎందరు తాపసుల్ చెడిరి యెందరు కర్మఠులట్టె భ్రష్టులై।
రెందరు మానులన్ బడిరి ఎందరు యోగులు జోగులైరి।
. ... .. ...............వీడనిభక్తి భజింపనేరకా।
చందము నొందకీవు.........................॥

తా— ఎందరు తపస్సు చేయువారు యెందరు కర్మఠులు అనగా స్నాన సంధ్య తీర్థయాత్రలను చేయువారు ఎందరు మునులు, ఎందరు యోగులు సదా భగవంతునియందు భక్తిలేక చెడిపోయి జోగులైరి నీవా విధము కావద్దు.

మానసబోధ శతకమునందు.

చ॥ అమితజపోపవాస నిగమాగమ సంస్తుతిఁ గంటె నిత్యసం।
యమనియమాదియోగ విహితాచరణంబులకంటె సాధుసం।
గమ ఏకాంతాన ధర్మములకంటె మహోత్తమ సౌఖ్యభాగదే।
యములను పొందవలంచు. .. . ..................॥

తా—జపము, ఉపవాసము, నిగమాగమము అష్టాంగయోగములకంటె పెద్దల సేవకంటె దానధర్మములకంటె భక్తియే శ్రేష్ఠము. దానధర్మములైనను భక్తిఁగలిగి జేయనిది వ్యర్థము జ్ఞానవాసిష్ట రామాయణము.

గీ॥ ఎందునభిలాషఁజేయని డెందమునకు।
కోరి సంసారముననున్న కొదువలేదు॥

అనురీతి విషయేచ్ఛలులేక భగవంతునియందు భక్తిఁగలిగి సంసారముననున్న ను తక్కువేమియులేదు.

నరహరి శతకము.

సీ॥ సుతులులేకుంటె సద్గతిలేదనిరిగాని తానుధన్యుండై తె తనయులేల।
భక్తులైనటువంటి భాగవతోత్తములకేమి లేకున్నను ముక్తికల్గు॥

సాంబశివ శతకము.

సీ॥ అతిసూక్ష్మమైన నిజాత్మఁగానక ఘోరతపములుఁజేతురుద్దండులగుచు
భక్తబంధుని నిన్ను భావింపఁగాలేకఁ బ్రమ్మరుదేశ బ్రమ్మరులభంగి॥

తా- 'భక్తిలేనిపూజ పత్రిచేటు' అన్నటుల భక్తిలేనివిద్య లెన్నియున్నను అవన్నియు దేనికిని కొఱకావు. వైవభక్తుడు కాను, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్య, మనునరిషడ్వర్గములఁబోనాడి శమము, దమము, తితీక్ష, ఉపరతి, శ్రద్ధ, సమాధానము అనుశమాదిషట్క సంపత్తినిచేకొని. శ్రవణము, కీర్తన, స్మరణ, అర్చన, వందనము, దాస్యము, సఖ్యము, ఆత్మనివేదన, పాదసేవ, యనెడి నవవిధ భక్తి లక్షణములతో మెలఁగవలెను.

శ్లో॥ సద్బుద్ధిసాధుసేవ సముచితచరిత స్తత్వబోధాభిలాషీ।
శాంతోదాంతోఽనసూయాశ్శరణముపగతశ్శాస్త్ర విశ్వాసశాలీ।
సద్ధర్మేసానురక్తస్సకల గుణగణస్సత్యవాచానురక్తః॥

తా- భక్తుఁడు శాంతశమదమాది పుంజరంజితుండై సర్వభూతములను తన వలెనే చూచువాఁడై, దయాదాక్షిణ్యము గలవాఁడై, పరమాస్తికుఁడై, సత్యవాచాను రక్తుడై సదాచారసంపన్నుఁడై యుండవలెను. భక్తుఁడు దేవునికి భృత్యాను భృత్యుడు అహంకార మమకారములు వదలి నిరంతరము భగవదోపాసనలతో కాలముఁ గడుపుచు తత్కీర్తనముల పాడుచు తదపారమహిమలను కొనియాడుచు తన స్థితిగతుల విన్నవించుకొనుచున్న, తన పాపరాసులను నిర్మూలించి తుదకు తన లోకమందు భక్తుని జేర్చుకొనును.

దేవుడు భక్తి నికల్పించి నాఁడు. భక్తికొఱకు మనుష్యులను సృజించినాఁడు. కావున సత్యమగు పశ్చాత్తాపమునొంది యాభక్తివైపు మొగముంచుడు.

విశ్వాసియై పుణ్యకార్యములు చేసిన యాతని సాన్నిధ్యమునకు వచ్చు వానికి పరమ పదము చేరగలదు. 20 సుర 3-76

తన భారమునే మోయుచున్న ఆత్మ మఱియొకని భారమునుగూడా మోయ బోదు. 35సు ర 3-4

నిశ్చయముగా విశ్వాసులు యెహూదీయులు (యూదులు) నసారీలు (క్రైస్తవులు) సబాయాను ఎవరైననుసరే దేవునియందును ప్రళయదినము నందును నమ్మకముగలవారు ఋజువర్తనులు వీరందఱును ప్రభుసమ్మానమును బడయ గలరు వారికి భయముగాని దుఃఖముగాని కలుగబోదు.

2 సుర 8: 62

సర్వమును పరిత్యజించినదిగా దేవునివైపు దృష్టినినిలిపి ఋజుమార్గవర్త నులగువారికి దేవుడు మేలుచేయగలడు. వారికే భయముగాని దుఃఖముగాని కలుగబోదు 2 సుర 13: 110

దేవుడు విశ్వాసుల పోషకుడు ఆతడు వారిని చీకటినుండి వెలుతురు లోనికిఁదెచ్చును. 2 సుర 34॥257

తనయందు భక్తిగలిగిన విశ్వాసులకు దేవుడు సెలవిచ్చిన దేమనిన నేను నేనే నాచిత్తానుసారముగా నీఅతిక్రమములను తుడిచివేయుచున్నాను నేను నీపాపములను జ్ఞాపకముచేసికొనను. యెషయా 43:2

నాయొద్దకు వచ్చువాని నేనెంతమాత్రమును బయటికి త్రోసివేయను

శ్లో॥ అనేక కర్మకర్తోపి దైవజ్ఞాన వివర్జితః।
దైవభక్తి విహీనశ్చ సంసారీనైవముచ్యతే॥

అనేకములగు పుణ్యకర్మలను చేసినవాఁడైనను దేవునియందు భక్తిలేనివాఁడై దైవమహిమ తెలియకుండెనేని బంధనిముక్తుడై మోక్షము నొందజాలడు.

సర్వేశ్వరునియందు భయభక్తులుగలిగి ఆయన త్రోవలయందు నడచువారందఱు ధన్యులు. కీర్త 128:1

తండ్రి తనకుమారులయెడల జాలిపడునట్లు దేవుడు తనయందు భయభక్తులు గల వారియెడల జాలిపడును. కీర్త 103:13.

నారాయణేతి యన్నాస్త్రేవదనే నామమంగళం।
నారాయణస్తమన్వేతి వత్సంగౌఃవత్సల॥

ఓవాయనా ఎవనియొక్క జిహ్వాగ్రమందు పరమమంగళమగు నారాయణ నారాయణ యనుపవిత్ర నామమువసించునో వానివెనుక పరమాత్ముఁడగు శ్రీమన్నారాయణుండు దూడను వెదకు గోవువలెతిరుగుచునే యుండును

ఆర్యులారా! శ్రీరక్షకుని కృపమనయందెలాగున్నదో ఆలోచింపుడు మనకు అతికరుణతో యిచ్చిన ఆయుస్సందువరకు ధర్మముగ నడచుచు పుణ్యకార్యములు చేయుచు బీదలయందు దయగలిగి సదాదేవునిభక్తితో సేవించినవానితో ఆయనసట్లనును. దిక్కులేనివానివలె నెంగుకు కన్నీళ్ళుకార్చుచు దుఃఖించుచున్నావు నేను ప్రేమస్వరూపిని మిగుల దయగలవానిని నాయుపకారము నీయందెక్కువగానున్నది. నీయందు నానెనరు నీలక్ష తల్లిదండ్రులకంటె నెక్కువగానున్నది. నీవెంత పాపివైనను నీయందు నాకమిత కరుణకలదు. గనుక విశ్రాంతినొందుము అని పరమ తండ్రియైన దేవుడు సెలవిచ్చుచున్నాడు. దేవునిదయపొందిన వారికుండుగతి యెంతో గొప్పది.

సీ॥ వాసుదేవ శ్లోకవార్తలాలించుచు కాలమేపుణ్యంబుగడుపుచుండు
నతనియాయువుదక్క నన్యులయాయువు నుదయాస్తమయములనుగ్రకరుడు
వంచించికొనిపోవు వాఁడదియెఱుఁగక జీవింతునెక్కాలమ్ము సిద్ధమనుచు
నంగనాపుత్రగేహారామ విత్తాదిసంసార హేతుకసంఘసుఖము॥

తే॥ దగిలివర్తింపఁ గాలంబు తఱియెఱింగి
దండధర కింకరులువచ్చి తాడనములు
చేసికొనిపోవఁ బుణ్యంబుచేయనైతి
పాపరతినైతినని యట్టు పలవరించు॥

భాగవతము ద్వితీయస్కంధము.

కృత్వాపాపం హిసంతప్యతస్మాత్పాపాత్ప్రముచ్యతే
నైవంకుర్యాత్పునరితి నివృత్యా పూయతేతుసః

ఒకడు పాపముజేసి దుఃఖించి ఇకమీద నేనట్టి పాపకార్యములు చేయుటలేదని నిశ్చయించుకొని చేయకుండెనేని అంతకుముందు తానుజేసినట్టి పాపములు పరిహారమగును. మనువు.

సర్వేశ్వరుని నామమున ప్రార్థనచేయువాడెవ్వఁడో వాఁడు రక్షింపఁబడును.

రోమా 10-13

నామనసా సర్వేశ్వరుని నాశ్రయింపుము. ఆయన జేసిన యుపకారములలో దేనినిమరువకుము కీర్త 103;2.

అహంత్వాసర్వపాపేభ్యోమోక్ష యిష్యామిమాశుచః

అనురీతిమన పాపములను తొలగించి మోక్షమిచ్చువాఁడు దేవుడని దృఢముగాన నమ్మలెను.

భగవన్నామము వినినతోడనే యెవ్వనిశరీరము పులకరించునో అతని వర్ణింపతరముగాదు.

ఓ పరమేశ్వరా! నేనునీచే నాడింపబడు కీలుబొమ్మను. నాచేయుపను లన్నియు నీచే ప్రేరితములు నేను అస్వతంత్రుడను నీదాసుడను అని ప్రార్థించు వాని భాగ్యము చెప్పతరముగాదు.

భగవంతుని కనుగొనలేని యీశరీరము నేల పోషింపవలెను. అను ఎవ్వనికి జనించునో వాడు తప్పక ముక్తిని చూరగొనును. గాఢవిరక్తి

మచ్చిత్తామద్గత ప్రాణాబోధయన్త పరస్పరమ్
కథయంతశ్చ మాం నిత్యం తుష్యంతిచరమన్తి చ॥ గీత 10-9

తా॥ భక్తులు భగవంతునియందు చిత్తముగలవారై ఆయనయందే జీవమును వుంచినవారై ఒకరి కొకరు బోధించుకొనుచు పరమేశ్వరుని గురించియే చెప్పకొనుచు నిత్యము సంతోషించుచుందురు. ముక్తిని బొందుదురు.

నీ ప్రతితలంపు దైవధ్యానము వలెనుండవలెను. ఈశ్వర కుటుంబమైన ఈప్రపంచజనుల నందఱను ప్రేమించి నీవీ లోకములో నున్నంతకాలము దేవునిపై పునకు మానవులందరిని వరలించుటయే ఉద్యోగమని నమ్ముము.

శ్లో॥ సువిశాల మిదంవిశ్వం పవిత్రంబ్రహ్మమందిరమ్,
చేతస్సు నిర్మలం తీర్థంసత్యం శాస్త్రమనశ్వరమ్.
విశ్వాసోధర్మమూలం హిప్రీతిః పరమసాధనమ్,
స్వార్థనాశస్తువైరాగ్యం ప్రకీర్తితే॥.

అనగా- విశాలమైన ఈప్రపంచమే పవిత్రమైన బ్రహ్మమందిరము మనస్సే నిర్మలమైన యాత్రాస్థలము సత్యమే నాశములేనిశాస్త్రము విశ్వాసమే మతమునకు మూలము, ప్రేమయేశ్రేష్టమైన సాధనము స్వార్థనాశమే వైరాగ్యము.

## గాయత్రీ మంత్రము.

ఓంభూర్భువస్స్వః తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్యధీమహి।
ధియోయోనః ప్రచోదయాత్ ॥ యజు 36:3 మం

ఓంకారస్వరూపుడు స్వయంభువు దుఃఖరహితుఁడు సర్వవ్యాపకుఁడు సమస్త జగత్తు నుత్పాదించినసకలైశ్వర్యముల నిచ్చువాఁడు స్వీకరించుటకు శ్రేష్టమైన యోగ్యుఁడు పరిశుద్ధస్వరూపుఁడు సమస్తసుఖముల నిచ్చుఆపరమాత్మ స్వరూపమును మేము ధరింతుముగాక జగదీశ్వరుడగు పరమాత్మయైనవాఁడు మాబుద్ధులను ప్రేరేపించుగాక.



భక్తిమార్గమందు అనేక కష్టములు అంతరాయములు సంభవించును శ్రేయోమార్గాభిముఖుడైనవాడు తుదకు జయముబొందును తప్పుమార్గముల కీడ్చు దుష్ప్రేరణలకు లోబడక జ్ఞానవైరాగ్యములచే భక్తి పెంపొందించుకొనవలెను. భక్తి వదరుబోతు వ్యర్థవాచాలత్వముగాదు. అంతరాత్మ పరమాత్మయందు పొందునట్టి పరమార్థమేదికలదో యదియేభక్తి భక్తిలేని విద్వాంసుల ఉపదేశమువారి యాత్మకే యానందకరముగాదు తనజీవిత సర్వస్వము భగవదర్పితము చేయవలెను.

కాయేనవాచామనసేంద్రియైర్వాబుద్ధ్యాత్మనావానుసృతిస్వభావాత్।
కరోతియద్యత్ సకలంపరస్మై నారాయణాయేతి సమర్పయేత్తత్॥

తా॥ దేహము వాక్కు మనస్సు బుద్ధి ఆత్మ మున్నగు సర్వము భగవదర్పితము చేయవలెను ఇదియే ఆత్మసమర్పణము - మాయవాదులు కొందఱు వేదాంతులమని చెప్పుకొనుచు సోమరులై కాలము గడుపుచుండిన లాభమేమియులేదు. ఇట్టి వేదాంతుల వలన లోకమునకుగాని తమకుగాని కించత్తయినను ఉపయోగములేదు.

మ॥ అరిషడ్వర్గము గెల్చి పిమ్మట నహంభావంబు గానొప్పుచు
స్థిర వేదాంతవిచార భూరితర కాంతార ప్రచారాప్తికి
ధరణిన్ వాడు గడులోభులెల్ల పరమాత్మ స్వరూపంబు దా
మరయన్నేరరె యెన్నిభంగులను దేవాదీనమందారమా॥

మనసర్వప్రయత్నములు భగవంతునిపైనాధారపడియుండవలెను

మత్ప్రసాదాదవాప్నోతి శాశ్వతంపదమవ్యయం, గీత 18॥ 56

అనగా భగవత్ప్రసాదము వలననేగాని మనకుత్తమప్రాప్తి గలుగనేరదని వేదయామిచాత్మానం త్వంగతిః పరమేశ్వర భక్తుడు తనయుదియగు సర్వస్వమును భగవంతునికర్పించి వానిసేవకంటె వాని స్మరణకంటె నుత్తమమగునదేదియులేదని తలంచును

ప్రార్థనయందు పట్టుదలగలిగి యుండుడి రోమా 12; 12 భక్తునిదృఢమైన ప్రార్థన మిగులబలము చేయును ఎడతెగక ప్రార్థనచేయుడి థెస్స 5: 17

ప్రభుని నామమునుబట్టి ప్రార్థన చేయువాడెవడో వాడు రక్షింపబడును. యోవేలు 2:32 రోమా 10:13.

మనలో దైవాత్మనివసించుచున్నది రోమంది 8 16

నీకుటుంబమువారు కూడ ప్రార్థన సలుపునట్లు శ్రద్ధపుచ్చుకొనుము 30 కుర 8 132 దేవుడునిశ్చయముగా మనుష్యుల యెడదయాదాక్షిణ్యపూర్ణుడై యున్నాడు
22. కుర 9.66.

విశ్వాసులారా మీ ప్రభువును నమస్కరింపుడు సాష్టాంగపడుడు ఆతని పూజింపుడు మీ శ్రేయస్సు కొఱకు క్రమ వర్తనులు కండు 22 సుర 10;78

విశ్వాసము గలిగి నిశ్చలచిత్తుడై దేవుని ధ్యానించువారి కాతడు సరియగు దారి చూపును 13 సుర 4; 28 మీరు కాలము నతిక్రమింపక ప్రార్థించుచుండుడు దేవునికి భయపడుడు ఆయన యొద్దకే మీరు పోవలసియున్నది 7 సుర 9; 72 తూర్పు పడమరలు రెండును నా దేవునివే కావున నీ వెటుతిరిగినను నాతని ముఖము కనఁబడును. ఆతడు సంతుష్టుఁడు సర్వజ్ఞుఁడు 2 సుర 14; 15, సాయంప్రాతలయందు నమ్రతతోడను భయముతోడను ఉచ్చస్వరముతో గాక మెల్లగా నీలో నీవే దేవుని ధ్యానింపుము అశ్రద్ధాపరులలోఁ జేరకుము. 7 సుర 24: 205.

భక్తులు ఘనతనొంది ప్రహర్షించుదురు గక కీర్తన 19: 5

శ్లో॥ ఆర్తా విషణ్ణాశ్శిథిలాశ్చ భీతాః ఘోరేషు చ వ్యాధిషు వర్తమానాః।
సంకీర్త్య సర్వేశ్వరశబ్దమాత్రం విముక్తదుఃఖాస్సుఖినో భవన్తి

తా॥ ఆర్తులును దుఃఖితులును శిథిలేంద్రియులును భీతాత్ములుఁగల వారును భయంకరముగ వ్యాధిగ్రస్తులయినట్టివారును దేవుని నామము నుచ్చరించిన మాత్రమున దుఃఖరహితులై సుఖులుఁగ నగుచున్నారు.

బైబిలు.

భూమిమీఁదనున్న భక్తులే శ్రేష్ఠులు; వారు నాకు కేవలము ఇష్టులైయున్నారు దావీదు కీర్త 16: 3.

భాగవతము.

మ॥ తనుహృద్భాషల సఖ్యమున్, శ్రవణమున్, వందనా
ర్చనముల్, సేవయు, నాత్మలో నెఱుకయున్, సంకీర్తనల్, చింతన
బనునీతొమ్మిది భక్తిమార్గముల భక్తాధిపునిన్ నమ్మిస
జ్జనుఁడై యుండుట భద్రమంచుఁ దలతున్ సత్యంబు రాజోత్తమా।

క॥ చాలదు భూదేవత్వము।
చాలదు దేవత్వమధిక శాంతత్వంబు।
జాలదు .............. వి।
బాలోద్యములారకీ భక్తి చాలినభంగిన్॥

మ॥ తపమున్ వంశముఁ దేజమున్ శ్రుతము సౌందర్యంబు నుద్యోగముం
నిపుణత్వంబుఁ బ్రతాప పౌరుషములున్ నిష్ఠాబలప్రజ్ఞలున్
జపహోమంబులుఁ జాలవీశ్వర! భవత్సంతుష్టికే............
..............భ_ నేయవలయుండ త్పర్య సంయుక్తుఁడై॥

సీ॥ నీగృహాంగణభూమి నిటలంబు మోనంగ
నొరసించి నిత్యంబు మ్రొక్కఁడేని।
నీమంగళస్తవ నికరవర్ణంబులు
వలుమారు నాలుకఁ బలుకఁడేని।
నీయధీనములుగా నిఖిలకృత్యంబులు
ప్రియభావమున సమర్పింపఁడేని।
నీపదాంబుజంబుల నిర్మలహృదయుఁడై
చింతించి మునుఁగఁ జిక్కఁడేని।

తే॥ నిన్నుఁ జెవులార వినఁడేని నీదు సేవ।
నేయఁడేని ముక్తినిఁ జెందఁగలఁడె।
యోగియైనఁ దపోవ్రతయోగియైన।
వేదియైన మహాతత్త్వవేదియైన॥

తా॥ ఏమానవుఁడు నీయాలయముముంగిలి నొసలు తగులునట్లు మ్రొక్కఁడో, నిత్యము సాష్టాంగపడి వినయ విధేయతలతో నిన్ను ప్రార్థింపఁడో ఎవ్వఁడు దన నాలుక యందు నీకల్యాణ గుణకీర్తనముల స్తుతింపఁడో ఏవాఁడు తన కర్మలను నీకు సమర్పింపఁడో ఏజనుఁడు పరిశుద్ధాంతరంగుఁడై నీపదాంబుజ ధ్యానమును వహింపఁడో ఏమర్త్యుఁడు నీగుణకీర్తనములకుఁ దన శ్రవణముల సమర్పింపఁడో ఎవఁడు నీసేవకుడు గాఁడో వాఁడు యోగియైనను, తపస్వియైనను, వ్రతియైనను, వేదవిదుఁడైనను, వేదాంతవేదియైనను పరమాత్మ! దేవరను నిన్నుఁ జేరలేఁడు.

రుక్మాంగద చరిత్ర.

ఉ॥ ఎవ్వని చిత్తవృత్తి భువనైక పరాత్పరుఁ జేరి చొక్కునో
యెవ్వని పల్కు లెప్డు పరమేశు చరిత్రలఁ జొక్కి సొల్పునో।
ఎవ్వని మేను సంతతము నీశుని దాస్యము నందు పొల్చునో
యవ్విమలాత్ముఁ డాపరముఁ డాకృతకృత్యుఁడె ధన్యుఁ డెన్నఁగన్

ఈశ్వరునియందు గౌరవప్రేమలు యుక్తచేష్టలుఁగలిగి ఇంద్రియ మనస్సులను వశపరచుకొని దేవపదములను పలల మేలనకును సేవకుఁడుగా తన్నర్పించుకొనుట యే జీవన్ముక్తుని భక్తిలక్షణము.

ముకుందమాల 14 శ్లోకము.

"తృష్ణాతోయేమదన పవనోద్ధూత మోహోర్మిమాలే దారావర్తే తనయ సహజ గ్రాహసంఘాకులేచ।

సంసారాఖ్యే మహతి జలధౌమజ్జతాంన స్త్రిధామన్ పాదాంభోజే వరదభవతోభక్తి నావంప్రయచ్ఛ"॥

తా— స్వామీ! సంసారమును దప్పించుకొనుట అలవిగానిపని. ఎట్లనగా భార్యాపుత్రాదులు సంరక్షణ భారముచేత మిగుల ప్రయాసము గలుగుటయు, కామము, ఆశ, మొదలైనవి మిగుల మితిగాఁ భాధించుటాదిగాగల సంకటముచేత సముద్రము వంటిదై దుస్తరముగానున్నది. ఇట్టి సంసార సముద్రమును దాటుటకు నీ పాదభక్తియే ఓడయయి తరింపఁజేయఁజాలునుగాని మఱియొకటిగాదు.

తన భక్తులపాదములు తొట్రిల్లకుండ దేవుడు వారిని కాపాడును 1 సమూ, 2:9 తనభక్తుల ప్రవర్తన దేవుడు కాచును, సామె. 2:8. అపవిత్రమైన ముసలమ్మ ముచ్చటలు విసర్జించి దైవభక్తి విషయములో నీకు నీవే సాధకముఁజేసి కొనుము 1 తిమో. 4.7.

"యల్లబ్ధ్వాపుమాన్సిద్ధోభవత్యమృతోభవతి, తృప్తోభవతి"

"యత్ప్రాప్యనకించి ద్వాంఛతి, నశోచతి, నద్వేష్టి.నరమతేనోత్సాహీభవతి"

నిజముగ నీభక్తిగలిగిన మనుష్యుఁడు సిద్ధుఁడగు అమృతుఁడగు తృప్తుఁడగు. మఱియు నీభక్తిని బొందినవాఁడొక్కటిని గోరఁడు శోకింపఁడు. ద్వేషింపఁడు విషయములయందు రమింపఁడు ఫలాపేక్షయై కర్మమునుఁజేయఁడు.

భక్తుఁడు భక్తినలనకోరికలీడేర్చుకొనఁడు. భక్తిత్యాగరూపమైనది. ఉపాస్యవకు సర్వము నివేదించి యాతని ప్రసాదముతప్ప వేఱుకోరిక లేనివాఁడు నిజభక్తుఁడు.

శ్లో॥ శుకాద్యాఃసనకాద్యాశ్చ పురాముక్తాహిభక్తితః॥
భక్త్యైవమామనుప్రాప్తా నారదాద్యశ్చిరాయుషః॥

తా॥ పూర్వముభక్తి వలననే శుకాదులకు బ్రహ్మ ఋషులును సనకాదులగు యోగీంద్రులును ముక్తులైరి భక్తివలన నే నారదాది మహర్షులును పరమాత్మసాన్నిధ్య మునుఁబొంది శాశ్వత సుఖస్వరూపులైరి.

ఈశ్వర సంహితయందు.

శ్లో॥ దాసభూతాస్స్వతస్సర్వే హ్యాత్మానః పరమాత్మనః ।
అతోహమపి తే దాస ఇతిమత్వా నమామ్యహమ్॥

తా—స్వయముగానే సమస్త జీవాత్మలు పరమాత్మకు దాసులు ఈకారణము చేతనే నేనును నీకు దాసుఁడనని తలచి నమస్కరించుచున్నానని శివుఁడు చెప్పుచున్నాఁడు.

శ్వేతాశ్వతరోపనిషత్తు.

శ్లో॥ ముముక్షుర్వై శరణమహం ప్రపద్యే॥

తా— మోక్షేచ్ఛఁగలిగిన నేను శరణు పొందుచున్నాను.

విష్ణుతత్వమునందు.

శ్లో॥ స్వోజ్జీవనేచ్ఛాయది తే స్వసత్తాయాంస్పృహాయతి।
ఆత్మదాస్యం హరేస్స్వామ్యంస్వభావంచ సదాస్మర॥

తా— జీవుఁడు తాను జీవించుటకిచ్ఛవుఁడిన, దేవుఁడు సంకల్పించియుండు మహాత్త్రగస్థితియందు తనకిచ్ఛవున్నయెడల జీవాత్మకు దాసత్వమున్ను భగవంతునికి స్వామిత్వమున్న స్వాభావిక లక్షణములనియెంచి ఎల్లప్పుడు దేవుని ధ్యానము చేయుమని అర్థము.

గరుడ పురాణము,

శ్లో॥ సర్వజ్ఞాల్పజ్ఞాభేదాత్తు సర్వశక్త్యల్పశక్తితః।
స్వాతంత్ర్యపారతంత్ర్యాభ్యాంసమ్భేదోనేశజీవయోః॥

తా— పరమాత్మకు సర్వశక్తి, స్వాతంత్ర్యము, సర్వజ్ఞత్వములును, జీవాత్మకు అల్పశక్తి, పారతంత్ర్యము, అల్పజ్ఞత్వములునుఁ గలిగియుండుటచే జీవాత్మ పరమాత్మలొకటి కాఁజాలవు.

ముకుందమాల.

శ్లో॥ పృథ్వీరేణురణుః పయాంసికణికాః ఫల్గుస్స్ఫులింగోలఘుః।
తేజోనిశ్శ్వసనంమరుత్తనుతరం రంధ్రంసుసూక్ష్మంనభః
క్షుద్రారుద్రపితామహప్రభృతయః కీటాస్సమస్తాస్సురాః।
దృష్టేయత్రసతావకో విజయతే భూమావధూతావధిః॥

తా—. ఓపరమేశ్వరా! అవాఙ్మానస గోచరమైన నీమహిమ యెదుట తేజస్సంతయు చిన్న మిణుగురుగాను, భూమిభూగోళిలోని సన్నని నలుసుగలెను, జలరాసులన్నియు చిన్ననీటి బిందువులుగాన, గాలియంతయు అతిచిన్నదైన ఊరుపుగాన, ఆకాశమంతయు మిగుల సన్నని రంధ్రముగాను, శివుడు బ్రహ్మ మొదలగు దేవతలందఱు సూక్ష్మపురుగులుగాను కనఁబడుచున్నారు. నీ అపార వైభవము సర్వోత్కృష్టమైనది.

'తచ్చక్షుర్దేవహితమ్ పురస్తాచ్ఛుక్రముచ్చరత్।
పశ్యేమశరదశ్శతమ్ జీవేమశరదశ్శతమ్॥'

తా—హేస్వప్రకాశకా! పరమేశ్వరా! నీవు విద్వాంసులకు హితముచేయువాఁడవు. శుద్ధమగు నేత్రమువలె సర్వలోకములను సత్యముఁజూపువాఁడవు. నీ కృపచేత మేము నూఱు సంవత్సరములవఱకు సమీచీనముఁ జూడఁగలము. నీయాశీర్వాదముచేత మేము నూఱేండ్లవఱకు జీవించఁగలము,

గీ॥ వెలితిలేకుండ నిత్యము వెలుగు ప్రభువు
సకల కల్యాణ గుణనిధి సర్వవిభుఁడు
మార్పులేకుండ నిండెడు మహితకీర్తి
యగుచు గొనయాఁడుడవని సద్భక్తి॥

॥ శ్రేష్ఠమైనది నీ ప్రేమ సృష్టికర్త।
ఇచ్చు నీ ప్రేమ క్షేమము హెచ్చునిలఁ।
సకల దిశలను దశలను విషయములను।
మమ్ము నిండెనంచెడు మైత్రిమేలయా॥

తే॥ ఆత్మలేచినవిక పరమాత్మయందుఁ।
గలియునని చెప్ప కథలెల్ల కలలె సుమ్ము।
అతని నిటుఁజూడ గాంచుగ వచట గూడ।
తప్పిపోయిన యమపురి తప్పదోయి॥

శ్లో॥ సత్యం సత్యం పునస్సత్యం ఉద్ధృత్యభుజముచ్యతే।
ప్రసాదాదేవ సర్వేషాం సర్వసిద్ధిర్మహేశితుః॥ సూతసంహిత.

తా— నేను సత్యముగాను మరల సత్యముగా చేతులు పైకెత్తి చెప్పుచున్నాను. అదేమన సమస్త ప్రాణులకును సర్వేశ్వరుని యొక్క ప్రసాదమువలన మనోనిశ్చలతనొంది మోక్షము దొఱుకునేగాని మఱియేయొక్క విధముచేతను సాధ్యముకాదు.

# 63 సతీ పతుల ధర్మము.

మనువు.

శ్లో॥ సంతుష్టో భార్యయా భర్తా భర్త్రా భార్యా తథైవచ ।
యస్మిన్నేవ కులే నిత్యం కల్యాణం తత్ర వై ధ్రువం॥

తా- ఏకులమునందు భార్యచే భర్తయు భర్తచే భార్యయు సంతోషులై యుందురో ఆకులమునందు సమస్త సౌఖ్యమును ఐశ్వర్యము నివసించును.

భారతాశ్వరపర్వము.

శ్లో॥ దరిద్రో వ్యసనీ వృద్ధో వ్యాధితో వికలస్తథా ।
పతితః కృపణో వాపి స్త్రీణాం భర్తా పరాగతిః ।

తా- భర్త దరిద్రుడైనను వ్యసనము గలవాడైనను వృద్ధుడైనను రోగియైనను అంగహీనుడైనను. పాపియైనను. భార్యకతడే అన్నిటికంటె పరమ శ్రేష్ఠుడు.

శ్లో॥ నాస్తి భర్తృసమో బంధుర్నాస్తి భర్తృసమ సుహృత్॥
భర్తతో సమానమైన బంధువును స్నేహితులును లేరు.

శ్లో॥ తుష్టే భర్తరి నారీణాం తుష్టాస్యుస్సర్వ దేవతాః॥
ఏయాడుదాని గుణములకు భర్త సంతోషించునో అట్టి యాడుదాని గుణములకు దేవతలు సంతోషింతురు.

శ్లో॥ స్త్రీణాంహి పరమోధర్మో భర్తృవాక్యాను పాలనమ్॥
స్త్రీలకు మగని వాక్యమును పరిపాలించుట పరమ ధర్మము. ఇల్లాలు ఇంటి కార్యములందును చతురాలై దుబారచేయక ఏకార్యమును చెడనీక యథాయోగ్యము వ్యయము చేయుచునుండవలెను.

భాగవత సప్తమ స్కంధము.

సీ॥ నిలయమ్ము వాటించి నిర్మలదేహియై శృంగారవేష ప్రౌఢఁజేయవలయు॥
సత్యప్రియాలాప చతురయై ప్రాణేశు చిత్తంబు ప్రేమ రంజింప వలయు॥
దాక్షిణ్యసంతోష ధర్మమేధాగల దైవతమని ప్రియుఁదలపఁ వలయు॥
నాథుఁడే పద్ధతి నడచునా పద్ధతి నడచి సద్బంధుల నడపవలయు॥
మార్ద్దనముఁ బతికి మజ్జన భోజన।
శయనపానరతులు జరుపవలయు॥

తా॥ ఇంటి నలంకరించునదియై శుచిత్వముఁగలిగి ఉన్నదానితో అలంకారముగా నుండి సత్యములు నింపైన ఆలాపములచేత పెనిమిటియందు ప్రేమగలిగి యుండవలెను. దాక్షిణ్యము, సంతోషము, ధర్మము, బుద్ధి మొదలగు వానిచేత భర్తను దైవమునువలె తలపరిచుచు మగని మార్గము ననుసరించి నాతని చుట్టముల

తగురీతిని చూడవలెను. తిన్నని గుణములచేత పతికి స్నాన భోజన పడక మున్నగు వానియందు చక్కగాఁ జరుపవలెను.

భారతారణ్య పర్వ పంచమాశ్వాసము.

క॥ కులవతులను సతులను ని।
ర్మలమతులను నయినయట్టి మగువలతోడం।
జెలిమి యొనరించునది దు।
ర్విలసిత వనితాభియుక్తి విడువుముతరుణీ।

తా॥ సద్వంశీకులను నిర్మలులైన స్త్రీలతో స్నేహము చేయవలయునుగాని దుష్ట స్త్రీల సాంగత్యము కూడదు.

సత్యవేదము ఎఫెసి 5 అ. 22, 23, 24 వచనములు.

స్త్రీలారా ప్రభువునకు (క్రీస్తునకు) వలె మీస్వపురుషులకు లోఁబడియుండుడీ. క్రీస్తు సంఘమునకు శిరస్సైయున్నలాగున పురుషుఁడు భార్యకు శిరస్సైయున్నాఁడు క్రీస్తే శరీరమునకు రక్షకుఁడై యున్నాఁడు. సంఘము క్రీస్తుకు లోఁబడినట్టుగా భార్యలుకూడ ప్రతి విషయములోను తమ పురుషులకు లోఁబడవలెను. "33 వ. భార్యయైతే తన భర్తయందు భయభక్తులుఁ గలిగి యుండునట్లు చూచుకొనవలెను." యోగ్యురాలు తన పెనిమిటికి కిరీటము సామెతె 12-4 బుద్ధిగల భార్య సర్వేశ్వరుని దానము. సామెతె 19-15. సర్వేశ్వరుని యందు భయభక్తులుగల స్త్రీ కొనియాడఁబడును. సామెతె 31=34

భారతాశ్చర్యపర్వము.

శ్లో॥ నాస్తి భార్యాసమం లోకేనరస్యార్తస్యభేషజమ్॥
దుఃఖితుఁడైనవానికి భార్యతో సమానమే దియులేదు.

శ్లో॥ భార్యాహీనం గృహస్థస్య శూన్యమేవచతద్గృహం॥
భార్యలేని గృహము శూన్యగృహము.

శ్లో॥ అనన్యాంశరణాం భార్యాంబుతుకాల వ్యతిక్రమం।
కుర్వంతి పురుషాలఘ్నాస్తే వైనరయుగామినః॥

పరుల నాశ్రయింపక తననే శరణు పొందియున్న భార్యను ఋతుకాలమందు సంతోషపెట్టనివాడు నరకమును పొందును.

ఏతావానేవ పురుషోయజ్జాయాత్మా ప్రజేతిహ ।
విప్రాః ప్రాహుస్తథా చైతద్యోభర్తాసాస్మృతాఙ్గనా॥ మను 9: 44

తా- భార్య పుత్రుఁడు, భర్త యీమువ్వురు, జేరియే పురుషుఁడగు చున్నాడని వేదమందు చెప్పఁబడియున్నది ఏలాగనిన భార్య తన అర్ధదేహమునియు

పుత్రుఁడు ఆత్మస్వరూపమనియు తాత్పర్యము. మఱియు వేదము తెలిసినవారు భార్యా భర్తలకు భేదము లేదని చెప్పుచున్నారు. గనుక నే "నాను కంపతియో వారింవకరోతియహ పోషణం అయూపమిహ ప్రాప్నోతి నరకంచగచ్ఛతి, భారత తాత్పర్య పర్వము.

తా- ఏపురుషుఁడు భార్యయందు దయగలవాఁడు కాఁడో ఎవఁడు ఇహమందు భార్యను పోషింపఁడో అట్టి వాఁడు ఈలోకమందు నానా కష్టములు పొంది పర లోకమందు నరకమును పొందును. భార్య అర్థాంగిగనుక ఆమె తనకు కేవలము భోగ సాధనమని తలంచకూడదు. సతులను ప్రేమించుడి వారిని నిష్ఠుర పెట్టవద్దు కొలొ 3: 19

తస్యాం చతే కులంతస్యాః త్వరోచమానాయాం సర్వమేవ నరోచతే॥ మను 3:62

తా- భార్య చక్కని దయ్యేదేని (సద్గుణముల చేతనని అర్థము, ఇల్లంతయు చక్కనిదగును ఆమె సొగసులేనిదయ్యేనేని ఇల్లంతయు చీకటి గలదిగానుండును.

శ్లో॥ అనేన నార్యా వృత్తేనా మనోవాగ్దేహ సంయతా।
ఇహాగ్ర్యాం కీర్తిమాప్నోతి పతిలోకం పరత్రచ॥

మనువు 5-166

తా॥ విధిప్రకారము మనోవాక్కాయముల పరిశుద్ధయైన స్త్రీ ఇహమందు కీర్తియును పరమందు పతిలోకమును పొందుచున్నది.

మా॥ ఇమంహిసర్వ వర్ణానామ్ పశ్యన్తో ధర్మముత్తమం।
యతంతేరక్షితుం భార్యాంభర్తారో దుర్బలా అపి॥

మనువు 9-6

తా॥ అన్ని వర్ణస్థులకును భార్యా సంరక్షణము మేలైన ధర్మమని తెలిసికొని పురుషులు శక్తిహీనులైయున్నను భార్యను రక్షించుటకై కృషిచేయవలయును

శ్లో॥ అర్ధంభార్యామనుష్యస్య।
భార్యాశ్రేష్ఠతమస్సఖా॥ ఇత్యాది॥

ఇత్యాది వాక్యముల ననుసరించి భార్య పురుషునియొక్క అర్ధశరీరము గను స్నేహితులందఱిలో ఉత్తమ స్నేహితురాలుగను సమస్త విషయములయందు సమాన స్వాతంత్ర్యముఁగలదిగా నుండుటవలన ఒండొరులు విశ్వాసముగలిగి మెలఁగవలెను. "ఇదినరునిలోనుండి తీయఁబడెనుగనుక నారియనబడెను ఆదికాండము 2:23

క॥ హితసతి గుణవతి విద్యా।
పతినిర్మల వర్తనానుమతియగు యువతీ।
పతికింటి భాగ్యవంతులు।
క్షితినెందునుగానరారు శ్రీవరలక్ష్మీ

భారతాశ్చర్యపర్వము,

శ్లో॥ ధ్యానయోగపరానిత్యం యాంగతిం యాంతి యోగినః ।
తామేవగచ్ఛతి నరసర్వభూత దయాపరః ॥

ధ్యానయోగపరులగు యోగులు పొందునట్టి పుణ్యలోకమును సకలభూతముల యందును దయగల మానవులు పొందుచున్నారు.

సత్యవేదము. కనికరము కోరుచున్నాను. మత్త 12-7

'కనికరముగలవారు ధన్యులు; వారు కనికరము పొందుదురు.' మత్తయి 5-7

'పరలోకమునందుండు మీతండ్రికి కుమారులైయుండునట్లు మీ శత్రువులను ప్రేమించుడి.' మత్తయి 5-44

దేవీభాగవతము 4 వ స్కంధము

తే॥ అన్నితపములకును బెద్దయన్నిదాన
ములకు నెక్కుడ యన్నినోములకు హెచ్చు
యన్నితీర్థములకునుగ స్నానకు వినుము
భూతదయకంటె ధర్మంబు భూమిలేదు॥

ఆ॥ సృష్టిలోనగలుగు జీవంబు లన్నియు। నిన్నుబోలి తిరుగుచున్నవగుట।
నెట్టిబాధయేని నీబాధగా। నెంచికొనుచు దయను జూపవలయు॥

ప్రాణుల నాపదమాన్పుటకంటె మనుజునకు చేయదగినది వేఱులేదు.

# త్రిమూర్తులు

## బ్రహ్మ

అథర్వవేద సంహిత.

శ్రు॥ బ్రహ్మవై బ్రాహ్మణ పుష్కరే సృజత్ ।
పరబ్రహ్మ బ్రహ్మను పద్మమందు సృజించెను.

శ్లో॥ యత్ర పద్మమభూత్పూర్వం తత్ర బ్రహ్మవ్యజాయత॥
ఎచ్చట పద్మము పుట్టినదో అచ్చట బ్రహ్మ పుట్టెను.

శివసంకల్పోపనిషత్తు.

శ్రు॥ అండం హిరణ్మయం మధ్యేసముద్రం ప్రథమంబభూవ।
అండాద్విష్ణుర్బ్రహ్మజాత వేరాళ్ళత స్సమనః । శివసంకల్పమస్తు॥

హిరణ్మయమైన అండముయొక్క మధ్యమందు పుట్టలుగట సముద్రము పుట్టెను. ఆయండమునుండి విష్ణువు, బ్రహ్మ, అగ్నిహోతుడు పుట్టిరి. ఈహేతువు చేత వారియొక్క మనస్సు శివునియందు సంకల్పమయిన దగుగాక అని యున్నది.

లింగపురాణము 71 అధ్యాయము

శ్లో॥ దక్షిణాఙ్గభవోబ్రహ్మసరస్వత్యాథకద్గురుః॥

శివుడు తన కుడిప్రక్కనుండి బ్రహ్మ సరస్వతీయను వారిని కలిగించెను.

శివుడు

యజుర్వేదము రెండో అష్టకము రెండో ప్రశ్నము పదియవ అచ్చమునందు.

శ్రు॥ తస్మాత్ప్రజాపతౌ హరఆసీత్॥

శివుడు బ్రహ్మయందు పుట్టెను.

యజుషియందు

శ్రు॥ స ప్రజాపతి రేకః పుష్కరపర్ణే సంభవత్।

లలాటక్రోధజోరుద్రమ్త్ర్యక్షః।

ఖండపరశుమజీజనత్॥

తా॥ బ్రహ్మయొక్కటే పద్మమందు పుట్టెను. ఆ బ్రహ్మ నొసట పుట్టిన క్రోధము వలన త్రినేత్రుడగు శివుడు పుట్టెను.

శివపురాణమందు

శ్లో॥ ఆదిశక్తిమయంబీజం బీజశక్తి మయం శివం॥

ఆదిశక్తి వలన బీజము బీజమువలన శివుడుగలిగెను.

లింగ పురాణము 71 అధ్యాయము.

'అణ్డాజ్జజ్ఞే సఏవేశః' అండమునుండి శివుడుత్పన్నమాయెను.

విష్ణుధర్మము సువర్ణ కైకుంఠ సంవాదమునందు.

'బ్రహ్మణశ్చాపిసం భూతశ్శివ ఇత్యవధార్యతాం'

శివుడు బ్రహ్మనుండి పుట్టినవాడని తెలిసికొనవలసినది.

విష్ణువు

శివసంకల్పోపనిషత్తు

అండం హిరణ్మయం మధ్యే సముద్రం ప్రథమం బభూవ।

అండాద్విష్ణుజాత .... ........................ ॥

గుణవతియైన భార్య ముత్యములకంటె అమూల్యమైనది. సామెత. ప్రేమగల భర్త వజ్రములకంటె అమూల్యము.

---

# అహింస

" తొలగునె హింసాపరులకు దుఃఖప్రాప్తుల్ "

విజ్ఞాన దర్పణము.

శ్లో॥ అహింసపరమో ధర్మః అహింసాపరమంతపః. అహింసాపరమందానం ఇత్యూచుర్మునయస్తథా॥

తా॥- హింసచేయకుండుటచే పరమధర్మము అదియే గొప్పతపస్సు అదియే గొప్పదానము అని మునులు చెప్పిరి.

భారతాశ్చర్య పర్వము.

శ్లో॥ అహింసాపరమోయజ్ఞస్తథా హింసాపరం దమః ।
అహింసాపరమంబోధ మహింసాపరమార్చనమ్॥

అహింసయే శ్రేష్ఠజ్ఞానము. అదియే పరమదమము అంత రేంద్రియ నిగ్రహము

శ్లో॥ కర్మణా మనసా వాచా యోహినస్తి నకించన ।
తన్మిత్రం సర్వభూతానాం మునిస్స్వర్గంభవోబ్రవీత్ ॥

లోకములో ఎవఁడు మనోవాక్కాయ కర్మలచేత ప్రాణికోటికి హింసచేయఁడో ఆట్టివాఁడు సకల భూతములకు మిత్రుఁడు గనుక ప్రాణులను బాధించ కూడదు.

క॥ కావునఁబరులకు హింసలు । గావింపఁగవలదు తనకుఁగల్యాణముగా ।
భావించి పరులనొంచినఁ । బోవునె తత్ఫలము పిదపఁబొందకయున్నే॥

---

## దయ

దేవుడు ప్రేమాస్వరూపి: ప్రేమ లేనివాఁడు దేవునినెరుగఁడు. 1 యోహా 4:8

శ్లో॥ సర్వవేదాశ్చయత్కుర్యుస్సర్వ యజ్ఞాశ్చభేచర ।
సర్వతీర్థాభిషేకాశ్చ యత్కుర్యాత్ప్రాణినోదయా ॥

సర్వవేదములను చదువుటవలన సర్వయజ్ఞములను ఆచరించుటవల్లను సర్వ తీర్థములలో స్నానము చేయుటవలనను వచ్చుపుణ్యము ప్రాణులయందు దయ చూపుట వలనఁగలుగును. 'మీ తండ్రి కనికరము గలవాఁడై యున్నట్టు మీరును కనికరముకలవారైయుండుడి' లూకా. 6-36

భారతాశ్వర్యపర్వము.

శ్లో॥ ధ్యానయోగపరానిత్యం యాంగతిం యాంతి యోగినః ।
తా మేవగచ్ఛతి నరసర్వభూత దయాపరః ॥

ధ్యానయోగపరులగు యోగులు పొందునట్టి పుణ్యలోకమును సకలభూతములయందును దయఁగల మానవులు పొందుచున్నారు.

సత్యవేదము. కనికరమునే గోరుచున్నాను మత్త 12:7

'కనికరము గలవారు ధన్యులు; వారు కనికరము పొందుదురు' మత్తయి 5:7 'పరలోకమందుండు మీతండ్రికి కుమారులై యుండునట్లు మీశత్రువులను ప్రేమించుడి.' మత్తయి 5:44

దేవీ భాగవతము 4 వ స్కంధము.

తే॥ అన్ని తపములకును బెద్దయన్ని దాన ।
ములకు నెక్కువ యన్నినోములకు హెచ్చు ।
యన్నితీర్థములకునుఁ గన్నాకు వినుము ।
భూతదయకంటె ధర్మంబు భూమిలేదు ॥

ఆ॥ సృష్టిలోనఁ గలుగు జీవంబులన్నియు। నిన్నుఁబోలి తిరుగుచున్నవగుట
నెట్టి బాధయేని నీ బాధగాఁ । జూచికొనుచు దయను జూపవలయు ॥

ప్రాణుల ఆపద మాన్పుట కంటె మనుజునకు చేయదగినది వేఱులేదు.



[67 వ పుటలోని శేషము]

హిరణ్యమయమైన అండముయొక్క మధ్యమునుండి మొదట సముద్రము పుట్టెను. ఆయండమునుండి విష్ణువు పుట్టెను.

శివపురాణము నందు,

శ్లో॥ ఆదిశక్తి మయం బీజం బీజశక్తి మయం శివః ।
శివశక్తిమయం విష్ణు...................... ॥

ఆదిశక్తి వలన బీజమును బీజమువలన శివుఁడును శివుని వలన విష్ణువును జన్మించిరి.

లింగపురాణము 71 అధ్యాయము.

'తస్య వామాఙ్గజో విష్ణు' శివుని యెడమ ప్రక్కనుండి విష్ణువు పుట్టెను. ఈయిన దశావతారములు యెత్తెనని పురాణములయందు వ్రాయఁబడినది.

శ్లో॥ మత్స్యః కూర్మ వరాహశ్చ నారసింహశ్చ వామనః ।
రామో రామేతి కృష్ణశ్చ బౌద్ధ కలికి మేవచ ।

మత్స్య, కూర్మ, వరాహ, నారసింహ, వామన, పరశురామ, రామ, కృష్ణ బుద్ధ, కలికి. ఈ పది అవతారములను విష్ణువు ధరించెను.

ముగ్గురు మూర్తులకు మూలమూర్తి పరబ్రహ్మము కర్మబంధముల త్రెంచుకొనిన పరిశుద్ధజీవులు బ్రహ్మాదిలోకములజేరి ఆలోకప్రళయాంతమున పరబ్రహ్మస్థానము జేరుఁగురు.



# గృహస్థ ధర్మములు

శ్లో॥ దాక్షిణ్యం స్వజనే దయా పరజనే శాఠ్యం సదా దుర్జనే ।
ప్రీతిస్సాధుజనే నయోనృపజనే విద్వజ్జనే చార్జవం ।
శౌర్యం శత్రుజనే క్షమాగురుజనే నారీజనే ధూర్తతా ।
ఏచైవః పురుషాః కళాకుశలా స్తేష్వేవ లోకస్థితిః ॥

సంసారియైన పురుషుఁడు స్వజనులయందు దాక్షిణ్యము ఇతరులయందు దయ దుర్జనులయందు కాఠిన్యము సాధువులయందు ప్రీతి నృపవరులయందు నయము విద్వాంసులయందు ఓర్పు స్త్రీలయందు దిట్టతనముఁగలిగి ప్రవర్తించవలెను. అట్లు వర్తించువారికి ఈ లోకయాత్ర సుఖముగా జరుగును.

భారతము.

శ్లో॥ మహతాం బహుమానేన । దీనానామను కంపయా ।
మైత్ర్యాచాప్యాత్మతుల్యేషు । యమేవనియ మేవచ ॥

గొన్పవారిని గౌరవముతోను దీనులను దయతోను సములను స్నేహముతోను చూడవలెను.

'భుక్త్వాతు సుఖ మాస్థాయతదన్నం పరిణామయుక్ ।
వృథా వివాద వాక్యాని పరివాదంచ వర్జయేత్ ।

నాటకశాస్త్ర వినోదేన సన్మార్గార్థ విశోధినా।
అహశ్శేషం సమానీత శిష్టైరిష్టైశ్చ బంధుభిః ॥

తా— దినమంతయు సత్కార్యములఁ జేయుచు శరీర పోషణమునకు తగు కార్యము లాచరించుచు సజ్జనుల సాంగత్యము గలుపుచు దూష్యసంభాషణమునందును దుష్టకృత్యములయందును మనస్సును పోనీక మంచి గ్రంథముల పఠించుట యందును కాలక్షేపము చేయవలెను.

కం॥ ధనధాన్య మెంతయున్నను ।
అనువుగ తన దేహమునకు నారోగ్యంబున్ ।
కనికరము నిండు చిత్తము ।
ననుదిన సంతసముఁ గలుగు నతఁడు సుఖించున్ ॥

గృహస్థు ఈశ్వరధ్యానపరుఁడై దైవవిషయిక జ్ఞానమునే తన జీవితము యొక్క పరమావధిగా నెంచుకొనవలయును. అట్టి పరతత్త్వాన్వేషుఁడై తానింకయు నిహసంబంధమగు దారాపుత్ర అతిథి అభ్యాగతుల విషయములలో తన విధులను సమగ్రముగా నిరంతరమును నెరవేర్చుచు ఈశ్వరార్పితముగా కర్మలజేయవలయును. జీవనోపాధికొరకు ధనార్జనను జేయవలసియుండును. కాన నట్టి ధనార్జన న్యాయానుకూలమై యుండవలయునే గాని చోర వంచన అనృత జన్యమగు అన్యాయార్జితమై యుండఁ గూడదు. తనజీవితమును భగవత్కైంకర్యమునకై వినియోగించుచు దీనజనులకు పోషింపవలయును.

గృహస్థు తనమాతాపితలను, ఆలుబిడ్డలను, దీనులను అన్నపానవస్త్రాదులతో సంతృప్తులనుగా జేయకయే తాను సంతృప్తుడగునో, యా గృహస్థుడు పాపమును జెందుచున్నాఁడు. మన శరీరములకు కారణభూతులు తల్లిదండ్రులు కనుక యెట్టి కష్టములను పొందియైనను తల్లిదండ్రులను పోషింప వలయును.

తనభార్యను దయతో నాదరించి పోషించుచుండవలెను. తనభార్య నెల్లప్పుడును వస్త్రాభరణములచేతను, అమృతము లొలుకు మృదుమధుర వచనములచేతను సంతృప్తురాలునుగా జేయుచుండవలెను. అన్య స్త్రీని వీక్షింప మనో వికారమును జెందినంత మాత్రముననే రౌరవాది నరకముల బొందుచున్నాడు. నాల్గవయేడు వఱకును తండ్రి కుమారుని నత్యంతానురాగములో పెంచవలయును పదునారవయేడు వరకును విద్యాబుద్ధులను గరపవలయును. ఇరువదవ యేట నేదేని కృషియందు దింపవలయును. అప్పుడు తండ్రి కుమారుని తనతో సమానునిగా జూచుకొని యతిప్రేమతో నుండవలయును. కుమార్తెలనుగూడ నిట్లేజూచుచు

వారలకుగూడ విద్యనతి శ్రద్ధతో గఱపవలయును. పిమ్మటకుమార్తెకు వివాహము చేసి అత్తవారింటికి బంపునపుడు వస్త్రాలంకారాభరణాలతో సత్కరింపవలయును. సమర్థుడైయుండియును నెవడు బంధుమిత్రాదులకును, బీదసాధులకును నాదరణను జూపడో వాడు మనుష్యమాత్రుడు గాడు.

శరీరమంతత్యంతముగు ముక్కలవపనికిరాదు. వస్త్ర ఆహార పానీయవిషయము అమితత్వమును మానవలయును. శరీరము పరిశుభ్రమై చురుకుదనము గలిగి పని చేయుట కెల్లప్పుడు సిద్ధముగా నుండవలెను. హృదయమెన్నడును నిర్మలమైయుండవలయును.

శ్రు॥ యోహవా అస్మాల్లోకాత్ । స్వంలోక మదృష్ట్వా ప్రైతి ।
సయేన మవిదితోనభనక్తి । అత్మాన మేవలోకము పా
సీతసయా అత్మాన మేవలోక । ముపాస్తేన హాస్యకర్మక్షీయతే ॥

తా॥ ఏ పురుషుఁడు రక్త మాంసాది వికారమగునీ దేహమునుండి పరమాత్మ స్వరూపమగు లోకమును యెఱుగకయే మరణమునొందునో అట్టి వాని దోషములను అపరమాత్మ నివారించి రక్షింపఁడు.

ఏకాగ్రచిత్తముచే పారాయణము గాని, యితరసత్కర్మగాని, తపస్సుగాని, భజనగాని, స్తుతిగాని, చేసినతరువాత యీక్రింద చెప్పినరీతిగా ఆశీర్వదించవలెనని పెద్దలేర్పరచినారు.

శ్లో॥ స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం ।
న్యాయ్యేనమార్గేణ మహీం మహీశాః ।
సర్వమానవే భ్యశ్శుభమస్తు నిత్యం ।
లోకాస్సమస్తా స్సుఖినోభవంతుః ॥
కాలేవర్షతు పర్జన్యః । పృథివీ సస్యశాలినీ ।
దేశోయం క్షోభరహితో । మానవాస్సంతు నిర్భయాః ।
అపుత్రాః పుత్రిణస్సంతు పౌత్రిణః॥
అథనాస్సథ నాస్సంతు జీవంతు శరదాంశతమ్ ॥

అనగా శుభము. రాజులు భూమిని, అందుండు జనులను ధర్మమార్గమునచే పరిపాలన చేయుదురుగాక. ఎల్లప్పటికి మనుజులందఱకు శుభముకలుగునుగాక లోకములన్నియు సుఖము జెందునుగాక సకాలమునకు వర్షము పర్జన్యుడు రప్పించుగాక, భూమి పైరులు గలదిగావలయు దేశమంతయు ఉపద్రవము లేకుండవలయు, మానవులు భయరహితులు గావలయు పుత్రులులేనివారికి పుత్రులు గలుగవలయు, పుత్రసంతాన ముండువారు పౌత్రసంతులు గావలయు, అనగా మనుమలపడయవలయు; బీదలు భాగ్యవంతులు గావలయు అందరూ నూరేండ్లు చల్లగా బ్రతుకుదురుగాక యని తాత్పర్యము. ఏకాగ్రతగల పరిశుద్ధ మనస్సుచే ఈరీతిని ఉత్తములు భగవత్కార్యము చేసినతోడనే దీవించినఆఫలము అందరికి తప్పక వ్యాపించును.

బ్రహ్మ సాధనమువలని ఫలితమును గురించియు దానివలన లభించెడు పవిత్రజీవితమును గురించియు, బృహదారణ్యకమునందినట్లు వర్ణింపఁబడి యున్నది.

“ ఏవం విచ్ఛాన్తోదాన్త ఉపరత స్తితిక్షుః సమాహితో భూత్వాత్మ న్యేవాత్మానం పశ్యతి సర్వమాత్మానంపశ్యతి. నైనంపాప్మాతరతిసర్వంపాప్మానం తరతి. నైనం పాప్మాతపతి సర్వం పాప్మానం తపతి. విపాపోవిరజో అవిచికిత్సో బ్రాహ్మణోభవతి. ఏషబ్రహ్మలోకః సమ్రాడేనం ప్రాపితో అసీతి హోవాచ యాజ్ఞవల్క్యః ” తా॥ ... యాజ్ఞవల్క్యుఁడు జనకునితో చెప్పుచున్నాఁడు... ఈ విధముగా జ్ఞానసంపన్నుఁడయిన పురుషుఁడు శాంతుఁడయి, దాంతుడయి (అంతఃకరణ తృష్ణా నివృత్తుఁడయి), ఉపరతుఁడయి (సమస్తోద్యములనుండియు విరతుఁడయి), తితిక్షుఁడయి (సుఖదుఃఖాది ద్వంద్వ సహిష్ణుడయి), తన యాత్మయందే, పరమాత్మను దర్శించును. సమస్త వస్తువులను ఆత్మస్వరూపమునకే దర్శించును. పాప మాయనను పరాజయము నొందింపఁజాలదు, ఇతఁడే సమస్త పాపమును పరాజయము నొందించును పాపమాయనను తపింపఁ జేయఁజాలదు, అతఁడే సమస్త పాపమును దగ్ధము చేయును. అతఁడు పాపరహితుఁడయి, కళంకరహితుఁడయి, సందేహ నివృత్తుఁడయి, జనిమయిన బ్రాహ్మణుఁడగును ఇదే బ్రహ్మలోకము (బ్రహ్మస్వరూపలోకము.) ఓ మహారాజా, నీవిట్టి బ్రహ్మలోకమును పొందితివి.

శ్వేతాశ్వతరోప నిషత్తు నందలి ఉపాసనలు “యాతే రుద్ర శివాతనూ రఘోరాన్ పాపకాశినీ, తయానస్తను వాశ న్తమ యాగిరి శన్తాభి చాకశీహిః ,,

హేరుద్ర, పర్వతములయందుండి పర్వత నివాసులగు తపస్వులకు సుఖమును సమకూర్చుఁడాడా, మంగళకరమును, అభయప్రదమును, పవిత్ర జ్యోతిర్మయమును అగునీ శరీరము ద్వారా, నీకటాక్షవీక్షణముల మాపయిఁజరపుము. ”

“ అజాత ఇత్యేవం కశ్చిద్ భీరుః ప్రతిపద్యతే। రుద్రయత్తే దక్షిణం ముఖం తేన మాం పాహి నిత్యం. ”--- “ నీవు జన్మరహితుఁడవని ప్రపంచమునందలి భయములచే భీతచిత్తుఁడయిన మానవుఁడు నిన్ను శరణు చొచ్చుచున్నాఁడు ఓ రుద్రుడా, నీప్రసన్న ముఖ మేది కలదో, దాని ద్వారానన్ను సర్వదా దక్షింపుమా.

“ బృహదారణ్యకమునందు “అసతో మా సద్గమయ తమసోమా జ్యోతిర్గమయ మృత్యోర్మా మృతం గమయ ” -- అసత్యమునుండి నన్ను సత్యమునకుఁగొని పొమ్ము, అంధకారమునుండినన్ను వెలుఁపలకుఁ గొనిపొమ్ము,మృత్యువునుండి నన్ను అమృతత్వమునకుఁ గొనిపొమ్ము.

## మోక్షము.

ఆత్మాకేవలతాం ప్రాప్తోయత్ర గత్వానశోచతి అత్యర్కానల దీప్తంతత్ స్థానం ఈశో మహాత్మనః॥ స్వర్గైవ ప్రభయారాజన్ దుష్ప్రేక్ష్యం దేవదానవైః యత్రగత్వాపునర్నేమంలోకమాయాంతిభారతఏతేవైనిరయాస్తాతస్థానస్య పరమాత్మనః తా॥ భగవంతునియందు ఏకాగ్రచిత్తముగల యోగులు, భక్తులు, మరణముపొందిన తర్వాత శరీరబాధలన్నియు నిలిచిపోవును. పిమ్మట దుఃఖము లేనిదియు ఆనందము హాయియుగల వెలుఁగు మయమైనదియు శ్రేష్ఠమైనదియు నగుదేవయాన మార్గమున ముక్తినిలయమున కేగుదురు. పరమ భక్తులకు ప్రాప్తమగు శోకనాశమైన ఆమహాస్థానము సూర్యాగ్నుల వెలుఁగుకంటె మించిన తేజస్సుగలది. దేవదానవులుచూడ సాధ్యముగానిది అచ్చటికేగినవారు మరల ఈలోకమునకు వచ్చుటలేదు. అదియే పరమాత్ముడుండు స్థానము. మఱియు సంసారమార్గంబునకు అంతిమంబైనది యని శ్రుతులయందుఁ జెప్పఁబడునట్టిదియగు భగవదనుగ్రహమే యవలంబముగా గలదియును సరిపూర్ణంబగు పరమపురుషార్థమును పొందఁబోవుదు ననెడి సంతోషము సపాథేయముగా గలదియు తత్ప్రకాశతద్వారః, అన్నట్లు భగవంతుని యమగ్రిహముచే చూపింపఁబడునట్టి యర్చిరాది మార్గమున అయా దేవతలు వారి వారి యధికారప్రదేశముల యంతమువఱకును మంగళదీపములను పూర్ణకుంభాదులను ఎదురుగా గొనివచ్చి పరిజన సహితముగా ఎదుర్కొని సార్వభౌముని కొనర్పదగినట్టి సత్కారంబుల నొనర్చుచు నివ్విధమున మార్గమున గొనిపోవుచుండగా ఈతండు ఈలోకమున నున్నప్పుడు ఈతనివలన సత్కరింపఁబడినట్టి వారలందఱు కానుక లర్పించుచు సేవించుచు ఈతనితోగూడా రాగా వారిచేనున్న పోజాలనట్టి ప్రదేశములదాటి పరమభక్తుల గోష్ఠిలో జొరబడినట్లయిన భేదము తెలియనట్టి పరిపూర్తి లభించి మనోరథము ప్రకారము సర్వకాలములయందు హాయి అనంమనుభవింతురు.

“ నామాటవిని నన్ను పంపిన వానియందు విశ్వాసముంచువాఁడు నిత్య జీవముఁగలవాఁడైయున్నాఁడు,, యోహాను 5:24. క్రీస్తు వచనము

మానవుఁడ దేహాద్యభిమానముల వదలి నిశ్చల చిత్తమున దైవ సంకీర్తనఁ జేయునట్టి నిర్మల భక్తియే ముక్తికి సులభ మార్గము.

శరణు భక్తుల రక్షకగురురూపశరణు పాపవిమోచక. ।
శరణు జీవుల పోషక శరణిదే కరుణించు దేవ దేవ. ॥

ప్రభోర్యేశో ఆగమ్యతాం భవతా ప్రకటన 22:20.

అస్మాకం ప్రభోర్యేశు ఖ్రీష్టస్యాను గ్రహఃసర్వేషు యుష్మాసు వర్తతాం తథాస్తుప్రక 22:21

మొదటి భాగము సమాప్తము.





## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA120B113 |
| పుస్తకం పేరు | శాస్త్రధర్మ సంగ్రహము |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 79 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | akshaya |
| పేజీలు విడదీసినది | Yasin |
| స్కాన్ చేసినది | Ch. Ramya |
| పరీక్ష చేసినది | KASIMBI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |